# ANDHRA READER

## FIFTH FORM

# ఆంధ్రవాచకము

## ఐదవఫారము.

MADDIRALA RAMARAO PANTULU GARU B. A., L. T



పబ్లిషర్సు:

వేంకటరామ్ అండ్ కో.,

హెడ్డాఫీసు:—ఏలూరు.

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల, బెజవాడ.

1930.

 [Price As. 12.

# విషయసూచిక.



## పద్యవిభాగము.



## గద్యవిభాగము.





# ఆంధ్ర వాచకము.

## ఐదవ ఫారము.

శ్రీమదాంధ్ర మహాభారతములోని

## ద్రౌపదీ వస్త్రాపహరణము.

పరిష్కృత కథాంశము నన్నయభట్టారకుని భారతము సభాపర్వములోనిది. గోదావరి మండలములోని రాజమహేంద్రవరము రాజధానిగాఁ జేసికొని రాజ్యమేలుచున్న రాజరాజనరేంద్రుని ప్రోత్సాహముచే నన్నయభట్టారకుఁడు భారత రచనమునకు దొరకొనెను. ఏకారణముననో నన్నయభట్టు ఆది సభాపర్వములు వ్రాసి అరణ్యపర్వమునందు "శారదరాత్రు లుజ్జ్వల" అను పద్యమువఱకు వ్రాసి యంతతో నాపిన, మిగిలిన అరణ్యకాండము ఎఱ్ఱాప్రెగడ పూర్తిచేసెను. మిగిలినపదునేను పర్వములు తిక్కనసోమయాజి పూర్తిజేసెను. వీరినె కవిత్రయమని యందురు. నన్నయభట్టారకుఁ డాంధ్రభాష కాదికవి. ఈయనకుముందున్న ఆంధ్రగ్రంథము లింతవఱకు దొరుకలేదు. నన్నయభట్టారకుఁడు క్రీ. శ. 1022-1063 న రాజ్యము బాలించిన రాజరాజనరేంద్రుని కాలమున నుంటచే దాదాపుగ నా

కాలమువాఁడె యనుట విశ్వసనీయము. నన్నయభట్టుకవిత మృదుమధురభూయిష్ఠమై సంస్కృతపదజటిలముగ నుండును. ఈయన ఆంధ్రశబ్దచింతామణి అను వ్యాకరణముగూడ వ్రాసెనని చెప్పుదురు.

నన్నయభట్టు ముద్గలగోత్రుఁడు. వైదిక బ్రాహ్మణుఁడు. వాగనుశాసన బిరుదము గలవాఁడు. సహపాఠియగు నారాయణభట్టు సహాయమున నితఁడు భారతము రచించెను. నారాయణభట్టు గొప్ప విద్వాంసుఁడు. పాండవుల ద్యూతము నందు ధర్మరాజు ఁనోడి కడకు ద్రౌపదినిగూడ నోడెను. దుర్యోధనుఁడు విజయానందమున నామఱచి పాండవుల ననేకభంగుల నొప్పించెను. అంతతోఁ బోక ద్రౌపదినిబట్టి సభకుఁ దెమ్మని ప్రాతికామి యనువానిని బంపెను. ఇదియె కథారంభము.

—♦ ప్రాతికామి ద్రౌపదియొద్దకు వచ్చుట ♦—

ఆ. వె. అవని నాథుచేత ♦ నాజ్ఞాపితుండయి
సూతనందనుండు ♦ ప్రాతికామి
పాండవాగ్రమహిషి ♦ పాలికిఁ జని భక్తి
వినతుఁ డగుచు నిట్టు ♦ లనియె సతికి.

తరువోజ. ధనసంపదలు నిజ♦ధరణి రాజ్యంబుఁ
దనయులం దమ్ములఁ ♦ దన్నును నిన్నుఁ
దనర జూదంబాడి ♦ ధార్తరాష్ట్రులకు
ధర్మతనూజుండు ♦ తా నోటువడియె
వనజాక్షి ! కౌరవ♦వరువని నిన్ను

వడిఁ దోడుకొని పోవ♦వచ్చితి నిపుడ
చనుదెమ్ము కౌరవే♦శ్వరుకడ కనిన
జలజాయతాక్షి పాం♦చాలి యిట్లనియె. 2

ఆ. ఏయుగంబునందు ♦ నెట్టి దుష్కృతవుండు
భార్య నొడ్డి యోటు♦వడిన భర్త
గలఁడె? యిది వినంగఁ ♦ గడు నపూర్వం బయ్యె
నిట్టు సేయునొక్కొ ♦ యిందుకులుఁడు. 3

తే. మున్ను దన్నోటువడి మఱి ♦ నన్ను నోటు
వడియెనో నన్ను మున్నోటు♦వడి విభుండు
గ్రన్నఁ దన్నోటువడియెనో ♦ యన్న! నాకు
నెఱుఁగఁ జెప్పుము దీని నీ ♦ వెఱుఁగుదేని. 4

వ. ఎఱుంగవేని యక్కృతవు నడిగి వచ్చి మఱి నన్నుఁ దోడ్కొని పోవ నగునేని దోడ్కొని పొమ్మనినం బ్రాతికామి క్రమ్మఱివచ్చి పాంచాలిపలుకులు ధర్మరాజునకుం జెప్పిన దురోదరపరాజయదుఃఖితచేతస్కుం డగుటం జేసి యతఁడు వానికి నదత్తప్రతివచనుం డైనఁ బ్రాతికామికి దుర్యోధనుం డిట్లనియె.

క. సందిగ్ధమయిన యర్థము
నిందఱసన్నిధిన యడిగి ♦ తింద యెఱుంగన్
సుందరిఁ బాంచాలేంద్రిసు
తం దోడ్కొని రమ్ము పొమ్ము ♦ తడయక యనినన్. 6

వ. వాఁడును ద్రౌపదిపాలికిం బోయి, దేవీ! నీ యడిగిన
యర్థంబు నిర్ణయించువారయి సభ్యులు నిన్ను రాఁ బంచిరి.
రమ్మనిన దుర్యోధను దుశ్చేష్టితంబునకు ధర్మరాజు సమ్మ
తంబునకు వెఱచి, యక్కోమలి ప్రాతికామి పిఱుంద నేకవ
స్త్రయు నధోనీవియు నవిరళగళితనయనోదకబిందుసందో
హపరిపీడ్యమానపీనస్తనపరిధానాంతరయు నగుచుసభకుం
జనుదెంచి కురువృద్ధసమీపంబున నున్నంత ద్రౌపదిం జూడ
నోపక లజ్జితులయి దుఃఖాయమానమానసులయి తలలు
వాంచి యున్న పాండవుల వైలక్ష్యం బుపలక్షించి సంతసిల్లి
దుర్యోధనుండు దుశ్శాసనుం బిల్చి ప్రాతికామి వృకోదరున
కు వెఱచు నీవు వోయి ద్రౌపదిం దోడ్కొనిరమ్మని పంచిన.

ఆ. నిర్దయాత్ముఁ బాప ♦ నిరతు దుశ్శాసనుఁ
బనుచు వెఱఁగి కృష్ణ ♦ పంకజాక్షి
గడుభయంబు నొంది ♦ గాంధారి యొద్దకు
నరిగెఁ గడు నడంగి ♦ యతిరయమున. 8

చ. తడయక కౌరవానుజుఁడు
దానిపిఱుందన పాఱె యింక నె
క్కడ కరుగంగఁ బోలుఁ జులు
కంజను దెమ్మిట సౌబలుండు ని
న్నొడిచె దురోదరంబునం గు
ణూత్తము నర్థము వైతి నిన్నునుం

బుడమిని దమ్ముఁ గోల్పడిరి
పాంచాలి! భవత్పతులైన పాండవుల్. 9

వ. అనుచు డాయవచ్చిన నేను రజస్వలను ముట్టకుండు మేక
వస్త్రనయి యున్నదాన మఱి గురుబంధుజనాధిష్ఠితం
బైనసభకు నెట్లు రానేర్తు ననిన నీ వేకవస్త్రవైననేమి విగత
వస్త్రవైన నేమి ని న్నెట్లుం దోడ్కొని పోదు నని బలా
త్కారంబున 10

ఉ. ఆననజాననం గురుకు
లాపశదుండు గడంగి రాజసూ
యావభృథంబునందు వసు
ధామరమంత్రపవిత్రవారిధా
రావళిఁ జేసి పావనము
లైన శిరోజములం దెమల్చి పా
పావహుఁ డీడ్చి తెచ్చె సభ
కందఱు సంభ్రమ మంది చూడఁగన్. 11

వ. ఇట్లు వాతాధూతంబైన పతాకయుంబోలె దుశ్శాసనాప
కృష్టయై ద్రౌపది వికీర్ణకేశయు వివర్ణవదనయు నై కర్ణ
దుర్యోధనశకుని సైంధవాదిదుష్టభూయిష్ఠంబైన సభకు
వచ్చి కోపలజ్జాపరవశ యయి.

చ. అనుపమదైవయోగహతుఁ
డయ్యె నవశ్యము ధర్మసంపదం

దనరున కాని ధర్మజుఁడు
ధన్యుఁ డధర్మపథంబు తప్పఁ ద్రో
క్కనె కురువృద్ధులార! భృశ
కోపనుఁ డీతఁడు నన్ను నేల దు
ర్జనుఁ డిట యీడ్చి తెచ్చె నవి
చారపరుం డయి దుర్మదంబునన్. 13

చ. ఇది యుచితంబుగా దనక
యిక్కురుముఖ్యులు సూచుచుండ దు
ర్మదుఁడయి వీఁడు నన్ను నవ
మానితఁ జేసెడి సర్వధర్మసం
విదు లన నున్న యీ భరత
వీరులవంశము నేఁ డధర్మసం
పద నతినింద్యమయ్యె నని
భామిని కృష్ణఁ దలంచె భీతయై. 14

వ. ఇట్లు జగత్రయవిజయభుజవీర్యసనాథులైననాథులు గలిగి యు ననాథయుంబోలెఁ బాంచాలరాజపుత్రి భయార్త యై యార్తజనశరణ్యుండైన జగన్నాథు జనార్దనుం దలంచుచుఁగపటద్యూతమధుమదోన్మత్తుండయిన ధర్మపుత్రుని నిమిత్తంబున నుద్గతంబయిన పాండవపరాజయదహనంబు దన రూక్షకటాక్షవీక్షణవచనంబులం బ్రవర్తించుచున్న దానింజూచిదుఃఖితుండై భీమసేనుండు ధర్మరాజునకిట్లనియె.

క. ధనకనకరత్నవరవా
హనధరణీరాజ్యములును ♦ నాయుధములు మ
మ్మును నోటువడుట యుచితమ
యినసన్నిభ! నీని కెల్ల ♦ నీశుఁడ వగుటన్. 16

క. ద్రుపదతనూజం బణముగఁ
గపటద్యూతమునఁ జేయఁ♦గాఁ దగునె జనా
ధిప! యిది దుష్టద్యూతము
నెపమునఁ బరిభూత యయ్యె ♦ నిష్కరుణులచేన్. 17

వ. శకునికైతవం బెఱింగియుం బాపద్యూతంబునఁ బ్రవర్తించి యధర్మప్రవృత్తుండ వయితి. కావున భవద్బాహుదాహంబు సేయవలయునని కోపించి పలికినం బవనతనయునకు నర్జునుం డిట్లనియె. 18

సీ. ధర్మతనూజుండు ♦ ధర్మువుఁ దప్పిన
ధరణీతలం బెల్లఁ ♦ దల్లడిల్లుఁ
దగిలి సుహృద్ద్యూత♦ధర్మయుద్ధములకుఁ
బరులచేఁ బిలువంగఁ♦బడి విభుండు
గడఁగక విముఖుండు♦గాఁ జన దని శుభ
క్షాత్త్రధర్మంబు లో♦కంబులందు
నిలిపెఁ దా నిది పతి ♦ నేరమియే దైవ
వైపరీత్యంబైన ♦ వనరఁ దగునె

ఆ. గురులఁ ధర్మపరులఁ ♦ గోపించి ధీరుల
తిక్రమింతురే త♦దీయనిత్య
ధర్మగౌరవం బ♦ధార్మికు లగుచున్న
పరులచేతఁ జెఱుపఁ ♦ బడియె నిట్లు. 19

వ. అనుచు దుఃఖితు లగుచున్న పాండవులను దుశ్శాసనాపకృష్టయై సభాంతరంబున నున్న ద్రౌపదిఁ జూచి వికర్ణుం డన్యాయశ్రవణవికర్ణులై మిన్నకున్న సభ్యుల కిట్లనియె. 20

క. సమచిత్తవృత్తు లగు బు
ద్ధిమంతులకు నిపుడు ద్రౌప ♦ దీ ప్రశ్న విచా
రము సేయవలయు నవిచా
రమునఁ బ్రవర్తిల్లు టది న♦రకహేతు వగున్. 21

వ. ఇక్కురువృద్ధులైన భీష్మధృతరాష్ట్రవిదురాదులును నాచార్యులయిన ద్రోణకృపాదులుం బలుకకైరి యున్న సభాసదు లెల్లం గామక్రోధాదులు దక్కి విచారించి చెప్పం డనిన, నెవ్వరుం బలుక కున్న, నే నిందు ధర్మనిర్ణయంబు సేసెద నెల్లవారును వినుండు జూదంబును వేఁటయుఁ బానంబును బహుభక్షణాసక్తియు నను నాలుగు దుర్వ్యసనంబులం దగిలినపురుషుండు ధర్మువుం దప్పి వర్తిల్లు నట్టివాని కృత్యంబులు సేకొనం దగవు. కితవాహూతుండై వ్యసనవర్తియయి పరాజితుం డయిన పాండవాగ్రజుండు పాండవుల కందఱకు సాధారణధనం బయినపాంచాలిఁ బణంబుఁ

జేసెం గావున ద్రౌపది యధర్మవిజిత; యకోకమలి నేక
వస్త్ర నిట దోడ్కొని తెచ్చుట యన్యాయం బనిన విక
ర్ణుపలుకుల కొడంబడక కర్ణుండు వాని కిట్లనియె. 22

ఆ. ఎల్లవారు నెఱుఁగ ♦ నొల్లనిధర్మువు
వేల ! నీకుఁ జెప్ప ♦ నేల వలసెఁ?
జిఱుతవాని కింత ♦ తఱుసంటిపలుకులు
సన్నె వృద్ధజనము ♦ లున్నచోట 23

వ. నీవు ద్రౌపది నధర్మవిజిత యని పలికితి. సభాసదులెల్ల
రెఱుఁగ ధర్మజుండు దనసర్వమ్ము నోడ్డి యోటువడినప్పు
డిది వానికి వెలిగాదు గావున ధర్మవిజితయ యిట్లు గాని
నాఁడు పాండవు లిండఱును దీని విజితఁగా నేల యొడంబడు
దురు. మఱి యేకవస్త్రయైయున్న దీని సభకుం దోడ్కొని
వచ్చుట ధర్మువుగాదంటివి. భార్యకు దైవమైనతుండయిన
భర్తయొక్కరుండ; యిది యనేకభర్తృక గావున బంధకి
యనంబడు; నిట్టిదాని విగతవస్త్రం జేసి తెచ్చిన ధర్మవిరో
ధంబు లేదని కర్ణుండు వికర్ణవచనంబులకుం బ్రత్యాఖ్యా
నంబు సేసిన విని దుర్యోధనుండు దుశ్శాసనుం బిలిచి
యిప్పాండవులయు ద్రౌపదియు వస్త్రంబు లపహరింపు
మని పంచిన దాని నెఱింగి. 24

క. కితవవ్యవసాయపరా
జితు లగుటంజేసి బలిమి ♦ చెడి పాండుసుతుల్

ధృతిఁ దమపయిపుట్టము లా
యతకీర్తులు మున్న పెట్టి ♦ యాసభ నున్నన్. 25

—♦ దుశ్శాసనుండు ద్రౌపది గట్టిన పుట్టం బొలుచుట ♦—

సీ. ఇది సేయఁగాదని ♦ మది విచారింపక
సద్గర్హితుండు దు♦శ్శాసనుండు
నెట్టన ద్రౌపది ♦ గట్టిన పుట్టంబు
సభలోన విడ్చె నా ♦ శంక లేక
యుడుగక యొలువంగఁ ♦ బడియు మున్నపనీత
మైన తద్వస్త్రంబు ♦ నట్టివేఱువ
లలితాంగిజఘనమం♦డలమునఁ బాయక
యొప్పుచు నున్న న♦య్యువిదఁ జూచి

ఆ. సభ్యులెల్ల నుదిత♦సమ్మదు లయిరి దు
శ్శాసనుండు వస్త్ర♦చయము పర్వ
తోపమానమయిన ♦ నొలువంగనోపక
యుడిగె లజ్జఁబొంది ♦ యుక్కుదక్కి. 26

వ. ఇట్లు భీమసేనుండు ద్రుపదరాజనందనకు దుశ్శాసనుండు సేసినయవమానంబు సూచి కోపరక్తాంతనయనుం డగుచు నంతకాకారంబున దంతసందష్టదారుణముఖుం డయి యెల్ల వారును విన నిట్లనియె. 27

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనే
కుల్ సూచుచుండఁగ మదో-

ద్ధురఁ ద్రౌపది నిట్లు సేసినఖలుఁ
దుశ్శాసనుఁ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవ
క్షశ్శైలరక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నా
స్వాదింతు నుగ్రాకృతిన్. 28

వ. ఇటు సేయనైతినేని పితృపితామహులగతికిం దప్పినవాఁడ
నగుదు ననిన నతని యతిమానుషం బయిన మహావ్యవసా
యంబున కద్భుతం బంది దిక్కులు చూడక ధిక్కృబద్ధముఖరిత
ముఖు లగుచు సభాజనులు తమలో సపుత్రకుం డయిన
ధృతరాష్ట్రు నిందించుచు దుపదరాజపుత్త్రి వాక్యంబులు
విచారింపక వృద్ధరాజు నుపేక్షించి రనుచుండి; రంత నుద్య
తబాహుండయి విదురుం డెల్లవారిని వారించి యిట్లనియె.

క. సుమతులు పాంచాలీ ప్ర
శ్నము నర్థము నేర్పడన్ విచారింపుఁడు పా
పము వొందు ధర్మసందే
హము దీర్పనివాఁడు సభ్యు లగు సజ్జనులన్. 30

మత్తకోకిలము.

ఈ వికర్ణుఁడు బాలుఁ డయ్యును
నేర్పరించి యథావిధిన్
దేవమంత్రియపోలె ధర్మువుఁ
దెల్పె నీతనిబుద్ధి మీ

రేవగింపక చేకొనుం డిది
మెల్లయందును ధర్మప
ద్ధావ మొక్కని కేర్పరింపఁగ
బ్రహ్మకైనను బోలునే? 31

ఆ. సభకు వచ్చి ధర్మ♦సందేహ మడిగిన
నెఱిఁగి చెప్పకుండి♦ రేని సభ్యు
లనృతదోషఫలము♦నం దర్థ మొందుదు
రనిరి ధర్మవేదు♦లైన మునులు. 32

ఆ. ధర్మ మెఱిఁగి దానిఁ ♦ దా నొండుగా లాభ
లోభపక్షపాత♦లోలబుద్ధి
సభల నెవ్వఁ డేని ♦ సభ్యుఁ డై పలుకు వాఁ
డనృతదోషఫలము ♦ ననుభవించు. 33

వ. ఈయర్థం బితిహాసంబులయందు వినంబడుఁ; దొల్లి ప్రహ్లా దునికొడుకు విరోచనుండును, నంగిరసుండనువిప్రునికొడుకు సుధన్వుండును నొక్కకన్యాపరిగ్రహనిమిత్తంబున నెల్ల సుగుణంబుల నేన పెద్ద నేన పెద్ద నని తమలో నిద్దఱును వివాదంబుచేసి ప్రహ్లాదుపాలికిం జని రందు సుధన్వుండు ప్రహ్లాదున కిట్లనియె.

తే. నీవు ధర్మవిదుండవు ♦ మావివాద
మెఱిఁగి తీర్పు గుణశ్రేష్ఠుఁ ♦ డితఁడో నేనో
చెప్పు మన్యథాబుద్ధి వై ♦ చెప్పితేని
మఘవుకులిశంబు వ్రచ్చు నీ ♦ మస్తకంబు.

వ. అనినం బ్రహ్లాదుండు భయంపడి కశ్యపుకడకుం జని విరో
చనసుధన్వులు తన్ను వివాదనిర్ణయం బడిగిన విధంబును
జెప్పిన విని వానికిం గశ్యపుం డిట్లనియె. 36

తే. సాక్షియును ధర్మదర్శియు ♦ సాక్ష్యవిధులు
దప్పఁగాదు తప్పినను న♦ధర్మయుక్తి
వరుణపాశసహస్రంబు ♦ వానిఁ గట్టి
పాయు నేఁటేఁట నొక్కొక్కఁ ♦ డాయతముగ. 37

వ. ధర్మం బధర్మవిద్ధం బయి సభకు వచ్చిన దానిం దీర్పని
సభ్యు లధర్మవిద్ధు లగుదురు. మఱి సభ్యులు కామక్రోధం
బులు విడిచి యధర్మంబు వాపనినాఁ డయ్యధర్మంబునం
దొక్కపాదంబు సభ్యుల నొక్కపాదంబు భూపతిఁ దక్కిన
యది గర్తనుం బొందు. సమంజసులైన సభ్యులచేత విధ్యు
క్తం బయ్యె నేని యధర్మంబు కర్తనుం బొందుఁ గావున
ధర్మంబు దప్పక చెప్పవలయు ననినం బ్రహ్లాదుండు ధర్మ
మతియై విచారించి తనకొడుకుకంటె గుణశ్రేష్ఠుండగా
సుధన్వుం జెప్పినఁ బుత్రస్నేహంబు విడిచి ధర్మువు దప్పక
చెప్పి తని ప్రహ్లాదుం బ్రశంసించి సుధన్వుం డరిగెఁ; గావున
మీరును ద్రౌపదీప్రశ్నంబునందు ధర్మబుద్ధి సేయుం డని
విదురుండు పలికిన దుర్యోధనుభయంబున సభ్యు లెవ్వరుం
బలుక రయిరి. ద్రౌపదియునట్లు సకలక్షత్త్రియసమక్షం
బున దుశ్శాసనుచేతం బరిభవింపఁబడి దుఃఖితయయి, 38

సీ. అవ్విధంబున నొప్పి ♦ యాస్వయంవరమునాఁ
డఖిలభూపతులచే ♦ నట్లు సూడఁ
బడి పాండవులధర్మ♦పత్ని నై గోవిందు
చెలియల నై వీని♦చేత నిట్లు
పరిభూత నగుచు స♦భామధ్యమున మహీ
పతులచేఁ జూడంగఁ♦బడితి నింత
వడుదు నే యిపుడు నా♦పలుకుల కెవ్వరుఁ
బ్రతివచనం ♦ బేల పలుక రైరి

ఆ. ధన్యులార! యే న♦దాసినో దాసినో
యెఱుఁగఁ జెప్పి పనుపుఁ ♦ డెల్లదాని
ననుచు వనరుచున్న ♦ నాపగాసుతుఁడు శాం
తనవుఁ డిట్టు లనియె ♦ దానిఁ జూచి. 39

వ. అవ్వా! నీప్రశ్నంబునకు నుత్తరం బయ్యుధిష్ఠిరుండ సెప్ప
వలయుఁ గాని నాఁడు ధర్మసూక్ష్మత యెవ్వరికిని నెఱుంగ
గహనంబు. దీనిఫలంబు వేగంబ యిక్కురుకులపాంసను
లనుభవింతు రని పలుకుచున్న యవసరంబున నక్కోమలిం
జూచి నగుచు. 40

తే. తరుణి! యేవురకంటె నొ♦క్కరుఁడ భర్త
యగుటఁ లగ్గు; జూదంబున ♦ నాలి నోటు
వడనివానిఁగాఁ దగుభర్తఁ ♦ బడయు మింక
ననుచు రాధేయుఁ డుల్లస♦మాడె నంత. 41

ఉ. అమ్మదితన్ విభీతహరి
ణాక్షిఁ గలాపవిభాసికేశ భా
రమ్మున నొప్పుదానిఁ దన
రమ్యపృథూరుతలంబు నెక్కఁగా
రమ్మని సన్న సేసె ధృత
రాష్ట్రసుతాగ్రజుఁ డప్పు డాని దూ
రమ్మునఁ జూచి కౌరవకు
రంగమృగేంద్రుఁడు భీముఁ డల్కతోన్. 42

క. లయసమయదండధర ని
ర్దయుఁడై ధరణీశు లెల్లఁ దనపలుకులు వి
స్మయసంభ్రమభయసంభృతు
లయి విను చూడంగ నిట్టు లనియెన్ సభలోన్. 43

ఉ. ధారుణిరాజ్యసంపదమ
దంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరుదేశమున
నుండఁగ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వారమదీయబాహుపరి
వర్తితచండగదాభిఘాతభ
గ్నోరుతరోరుఁ జేయుదు సు
యోధను నుగ్రరణాంతరంబునన్. 44

వ. అని సర్వజనభయానకక్రోధావేశవివశుండయి యాయుధంబు లున్నవలనికి దృష్టులు సలుపుచు నగ్రజు మొగంబు సూచుచున్న భీమసేను నతిరౌద్రాకారంబు సూచి భీష్మవిదురద్రోణాదు లిది కోపంబున కవసరంబు గా దని యాతనిం బ్రశాంతచిత్తుం జేసి రంత. 45

క. ధృతరాష్ట్రు నగ్నిహోత్రా
యతనంబున నఱచె నఱుఁ ♦ లగ్నులు శాంత
ద్యుతు లయ్యెఁ గౌరవస్త్రీ
తతిహృదయము లధికశోక ♦ తప్తము లయ్యెన్. 46

క. సూత్రాత్మకులై దుష్పద
వీరతులగు ధార్తరాష్ట్ర ♦ వీరులశయ్యా
గారముల నెగసె నెంతయు
ఘోరంబుగఁ గాకఘూక ♦ ఘూత్కారంబుల్. 47

క. అట్టి మహోత్పాతంబులు
పుట్టినఁ గృప విదుర ♦ కలశభూ శాంతనవుల్
నెట్టన ధృతరాష్ట్రునకుఁ
బుట్టె నరిష్ట మని రిష్ట♦మునఁ దమలోనన్. 48

వ. అంతయు నెఱింగి గాంధారి విదురుం దోడ్కొని ధృతరాష్ట్రు కడకుం బోయి పాండవపరాజయంబును ద్రౌపదిపరిభవంబును దుర్నిమిత్తోత్పత్తియుం జెప్పిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనుం బిలిచి యిట్లనియె. 49

చ. పరమపతివ్రతన్ సభఁ ద
పస్వినిఁ బాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతి
మానవభామినిఁగాఁ దలంచి దె
ష్పరములు వల్కెఁగాఁ దగునె
బాల్యమునాదిగ దుష్టభావనం
బెఱిఁగితి నీనిమిత్తమునఁ
బెద్దయు దుఃఖితు లైరి పాండవుల్. 50

వ. వారలవలన నీదు రాగ్రహంబు ఉడుగు మని కొడుకును భంగించి సకలబాంధవహితంబు సేయఁ దలంచి ద్రౌపదిని రావించి శాంతవచనంబుల నిట్లనియె. 51

—♦ ధృతరాష్ట్రుఁడు ద్రౌపది కోరినవరంబు లిచ్చుట ♦—

క. సుందరి! నాకోడండ్రం
యం దభ్యర్చితవు నీవ ♦ యతిమోదమున నీ
కొందగఁ బ్రియంబు సేసెద
నిందుముఖీ! వేఁడు మెద్ది ♦ యిష్టము నీకున్. 52

వ. అనినం బాంచాలి యిట్లనియె. 53

ఆ. కరుణతోడ నాకు ♦ వరము ప్రసాదింప
బుద్ధియేని లోక ♦ పూజితుండు
మనునిభుండు ధర్మ♦తనయుండు దాస్యంబు
వలన బాయవలయు ♦ వసుమతీశ! 54

వ. అట్లయినం గురుకుమారులు గురువృద్ధజనలాలితుండ్రై పెరిగిన ప్రతివింధ్యు దాసపుత్త్రుం డనకుండుదు రిదియనాయిష్టం బనిన నిచ్చితి నింక రెండవవరంబు వేఁడు మనిన ద్రౌపది యిట్లనియె. 55

క. నెమ్మని ధర్మజు నలువురు
దమ్ములుఁ దమయాయుధముల ♦ తమవర్మవరూ
ధమ్ములయుఁ దోడ సకలహి
తమ్ముగఁ బాయంగవలయు ♦ దాస్యమువలనన్. 56

వ. అనిన ధృతరాష్ట్రుండు నీకోరినవరం బిచ్చితి నింక మూఁడవ వరంబు వేఁడు మనిన ద్రౌపది యిట్లనియె. 57

ఆ. వైశ్యసతికి నొక్క ♦ వరము క్షత్త్రియ
సతికి రెండు శూద్ర ♦ సతికి మూఁడు
విప్రసతికి నూఱు ♦ వేఁడఁ జన్వరములు
గాన నింక వేఁడఁ ♦ గాదు నాకు. 58

వ. అనిన ధృతరాష్ట్రుండు కోడలిగుణంబులకు ధర్మం బెఱుంగుటకు సంతసిల్లి యనుజసహితుండయిన యుధిష్ఠిరు రావించి నీవు సర్వసంపదలు స్వరాజ్యంబును నొప్పుకొని మెప్పొంది యట్ల యింద్రప్రస్థపురంబున కరిగి సుఖం బుండుము. నీకు లగ్గయ్యెడు మని వెండియు,

తే. నీవు నిత్యంబు వృద్ధోప ♦ సేవఁ జేసి
మెఱుఁగు దెల్ల ధర్మంబుల ♦ నెఱుక లేక

కడcగి నీ కెగ్గు సేసె నా ♦ కొడుకు దీని
మఱచునది, నీకు నే నొండ్లు ♦ గఱప నేల? 60

క. మనమున వేరమిc దలcపమి
యును సక్షమచిత్తుcడగుట♦యును గుణములు కై
కొని దోషంబులు విడుచుట
యును నుత్తముc డయిన పురుషు♦నుత్తమగుణముల్. 61

వ. ఏను బుద్ధి లేక జూదం బుపేక్షించితి నల్పబుద్ధిసత్త్వం డయిన వృద్ధు నన్నును మీతల్లియైన గాంధారినిం దలంచి దుర్యోధనాధులు సేసిన దుర్నయంబులు సేకొన కుండినది. సర్వశాస్త్రవిదుం డయిన విదురుండు మంత్రిగా సర్వధర్మ విదుండ వైన నీవు రక్షకుండవుగా నిక్కురుకులంబునకు లగ్గగు నని ధర్మరాజనకుc బాండురాజు రాజ్యంబు సమర్పించిన.

తరలము.

తరుణి ద్రౌపది యిట్లు పాండవ • ధార్తరాష్ట్రులవైనభీ
కరపరస్పర కోపవేగము ♦ గన్నc బాచి విపత్తిసా
గరనిమగ్నుల నుద్ధరించెc బ్రి ♦ కాశకీర్తుల ధీరులం
బురుష సింహములన్ నిజేశులc♦బూని దద్దయుc బ్రీతితోన్.



భాస్కర రామాయణములోని

# భరతుని సౌశీల్యము.



[భాస్కరుఁడు రచించిన దగుటచే దీనికి భాస్కరరామాయణమని పేరువచ్చెను. గ్రంథభాగము లుత్పన్న మగుటచేఁ గాఁబోలు దీనిలోని కాండములఁ బలువురు పూర్తిచేసిరి. బాలకాండము శాకవల్లి మల్లికార్జునభట్టు అయోధ్యాకాండము కుమారరుద్రదేవుఁడు అరణ్యకాండము భాస్కరుఁడు సుందరకాండము మల్లికార్జునభట్టు యుద్ధకాండము భాస్కరుఁడు అయ్యలార్యుఁడు రచించిరి. ప్రకృత పఠనీయభాగ మయోధ్యాకాండములోనిది. గ్రంథకర్త కుమారరుద్రదేవుఁడు మారయకుమారుఁడు. సారస్వతభట్టబాణ బిరుదాంకితుఁడు. ఈయన తన గ్రంథభాగమును బ్రతాపరుద్రచక్రవర్తి యశ్వసైన్యాధ్యక్షుఁడగు సాహిణి మారునకు నంకితము గావించెను. కానఁ బ్రతాపరుద్రునితోఁ బాటుగ సాహిణిమారునితోఁ బాటుగ నీకవియు క్రీ. శ. 1290-1330 వఱకునుండియుండును. రుద్రదేవుని కవిత మృదుమధురపదభూయిష్ఠమై మనోహరముగ నుండును. రామాయణకథ నీతఁడు సంగ్రహించెను. ఇతని యాంధ్రీకరణము స్వతంత్రరచనమువలె నింపుగనుండును.

పుత్రశోకమున దశరథుఁడు పరలోకగతుఁడైనది మొదలుకొని భరతుఁడు శ్రీరాముని పాదుకలతో నంది గ్రామమునకుఁ జేరువరకుఁ గల కథాంశ మిందు భరతుని సౌశీల్య మను పేర నుద్ధృత మయ్యెను.]

ప. అని యనేకప్రకారంబులం గౌసల్య శోకింప సుమిత్ర లోనుగా నంతఃపురకాంతలెల్ల నడలుచుండి, రంత నుదయసమయంబున వసిష్ఠవామదేవాది పురోహితులును సుమంత్రపురోగములయిన మంత్రులును నధికసంభ్రమంబులతోఁ జనుదెంచి నానాప్రకారంబుల దుఃఖించిరి. పదంపడి రఘువంశగురుండైన వసిష్ఠుండు సర్వజనసమ్మతిం గాలోచితంబు నిశ్చయించి దశరథేశ్వరు దేహంబు తైలపక్వంబు సేయించి సింహాసనంబునం గూర్చుండఁబెట్టి జయంతుండు మొదలుగా నలుపురు మంత్రులం బిలిచి మీరు వస్త్రాభరణంబులు గైకొని గిరివ్రజపురంబున కరిగి భరతుం దోడ్కొని రండని నియోగించిన వారును నయోధ్య వెడలి యేడవరాత్రి నక్కేకయరాజు నగరంబు సొచ్చి; రంతకుమున్న సముద్రం బింకిపోవను జంద్రమండలంబు నేలంబడియుండనుం గలగని యాదుస్స్వప్నంబును సుహృజ్జనంబులతోడం జెప్పుచున్న భరతుం గాంచి మ్రొక్కి తమ తెచ్చిన యుపాయనంబు లిచ్చి, "దేవా! వసిష్ఠుండు మహాకార్యంబు గలిగి మమ్ముం బుత్తెంచె; నీవయోధ్యకు

విచ్చేయవలయు" నని విన్నవించుటయు నాదూతచేష్టలకు భీతిల్లుచుఁ గేకయనాథుకడకుం జని యత్తెఱం గెఱింగించి యన్నరేంద్రువీడ్కొని శత్రుఘ్నసహితుండయి కదలి సప్తరాత్రంబులకుఁ బురంబున కేతెంచి యంతిపురంబు సొత్తెరం దల్లి యెదురుగాఁ బఱతెంచి యాలింగనంబు సేయుటయు, నద్దేవికి నమస్కరించి కేకయపతి పుత్తెంచినయాభరణంబు లిచ్చి, వారి సేమం బెఱింగించి, పదంపడి, యిది యేమి రాజమార్గంబు లమంగళావృతంబులై యున్నయవి; నగరేల శూన్యంబై యున్నది? సంతోషనాదంబు లేల వీతేవు? నామనంబు గలంగెడు నెల్లవిధంబుల భద్రంబుల కదా? యిట్లునికిం గారణం బేమి? యనుటయు నక్కైక యిట్లనియె.

—♦ భరతశత్రుఘ్నులు రాముని వనగమనాదులు విని యడలుట ♦—

సీ. వసుమతీపతి రెండు ♦ వరములు మును
నాకు నిచ్చినయవి గల ♦ వేను వాని
నొకట నీపట్టంబు ♦ నొక్కట రాముని
విపినవాసముఁ బోవ ♦ వేఁడికొంటి
సంతసంబునఁ దండ్రి ♦ సత్యంబుఁ బాలింప
జానకీలక్ష్మణ♦సహితుఁ డగుచు
నారాఘవుం డేగె ♦ నడవికి, మృతుఁడయ్యెఁ
బుత్రశోకంబున ♦ భూవిభుండు

నిష్ఠురంబు లెల్ల ♦ నీకొఱ కిట్లేను
గట్టికొంటి నింక ♦ గౌరవమునఁ
బట్టి పూను రాజ్య♦పట్టంబు నా మూర్ఛ
వచ్చి వ్రాలి కొంత♦వడికిఁ దెలిసి.

క. కనుఁగవ నిప్పులు రాలఁగఁ
గనలుచు భరతుండు కైకఁ ♦ గనుగొని, యా రా
మునిఁ గాంతారంబునకుం
జను మన నెట్లాడె నోరు ♦ చయ్యన నీకున్? 3

చ. అడవుల రామచంద్రుఁడు జ
టాజినము ల్ధరియించియుండ నేఁ
బుడమి భరించి భోగములు
పొందఁగలానటె యిట్టి చొప్పు లే
యొడఁగల వింక నన్ను మొగ
మేమి తెఱంగునఁ జూతుఁ బాపపుం
గడుపునఁ బుట్టి యీభువన
గర్హకుఁ బాత్రుఁడ నైతి రాక్షసీ! 4

క. నాచిత్తవృత్తి యెఱిఁగియు
నాచరితము గనియు రాము♦నకు ద్రోహింగా
నీచమతి యొగ్గు సేసితి
వోచెల్ల, మనంబు నొచ్చె♦నో రఘుపతికిన్. 5

వ. దీనికి సుమిత్రాపుత్రుండు నామీఁద నెంత కోపించెనో
నీనిమిత్తంబున నిన్నిచేటులు పుట్టె నీ వొక్కరక్కసునకుం
బుట్టఁబోలుఁ గేకయరాజబీజం బింతకేల దొడంగు? నీవు
పాపజాతివి పతిహంత్రివి, నీతో సంభాషింపం దగదని పలుక
నప్పలుకులు వాకిటం బొంచి వినుచున్న మంథర నంతః
పురకాంతలు శత్రుఘ్నునకుం జూపి దీని దుర్మంత్రంబున
నీయనర్థంబు లిన్నియుం బాటిల్లె ననవుడు నతండు రోషా
విష్టుం డగుచుఁ బెలుచ దానిం బడఁదాఁచి కేలం గడకాలు
పట్టి మీఁదికెత్తి జిఱజిఱం ద్రిప్పి నేలతో వ్రేసి ఖడ్గంబు
దిగిచి యంకించుచుం దొలంగుం డిద్దురాత్మురాలి తల
దుంచెద ననుచుఁ గైకకుం గవిసినం దత్పరిచారికలు వాఱి
కౌసల్యాదేవి మఱువు సొచ్చిరి. అప్పుడా భరతుం డోహో
శత్రుఘ్న మన మీపాపజాతిం జంపిన మాతృహంత లని
రామచంద్రుండు మన మొగంబులు సూడండు, కావున
నీపుణ్యహీన తన దురితంబునఁ దాన పోవుంగాక దాసీ
వధంబును నర్హంబుగాదు దీననేమిగలుగుఁ బోవని మ్మ
నుచు నలుక వారించి యతం డనుజసహితంబుగాఁ బోయి
కౌసల్యాసుమిత్రల యడుగులం బడి రోదనంబు సేయు
టయు నయ్యగ్రసవిత్రియుఁ బుత్రులం గనుంగొని. 6

తే. భరత! మీతల్లి పతిఁబంచె ♦ పట్టె నీకు
రాజ్యపట్టంబునకు వేఁడి ♦ రాము నడవి

కనిచెఁ దద్వియోగమున గ♦తాసుఁడయ్యె
నృపుఁడు నీవింక నెమ్మది ♦ నేల యేలు. 7

సీ. అనవుడుఁ గడునొచ్చి ♦ యతఁడు గౌసల్యతో
నారామునకుఁ ద్రోహి ♦ నైతినేని
నభిషేకలక్ష్మికి ♦ నాససేసితినేనిఁ
గ్రౌక గావించిన♦ కపటకర్మ
విధ మెఱింగితినేని ♦ విప్రుఁ జంపినవాని
గతికి గుర్వంగనా♦గామిగతికిఁ
గల్లుద్రావినవాని♦గతికి సువర్ణాప
హరణంబుసేసిన♦యతని గతికి

ఆ. వె. భండనముననోడి ♦ పాఱినయాపంద
గతికిఁ బోదు నాదు ♦ కడిఁదిశపథ
ములకు సాక్షు లఖిల♦మునులు దివ్యులు భూజ
లానిలాంబరానలార్కశశులు. 8

వ. అని పలికినం బృథివ్యాధిమహాభూతంబు లితనిపలుకులు సత్యంబులను నెలుంగులం జెలంగెఁ గౌసల్యాసుమిత్ర లప్పు డప్పుత్రులం బట్టుకొని సంకులాక్రందనంబులుసేయనప్పుడు వసిష్ఠుండు వారి వారించి యంతఃపురంబునకుం దోడ్కొని పోవుటయు నప్పు డక్కుమారులుం దండ్రికళేబరంబుసూచి మూర్ఛవొంది వసుంధరంబడి రంతఁ గొంతసేపునకుం దెలి వొంది భరతుం డెలుఁగెత్తి యోరాజకుంజర యోదివాక రాన్వయరత్నాకరసుధాకర యోదశరథేశ్వర కేకయ

రాజు మీకుఁ బుత్తెంచిన భూషణంబులు దెచ్చినాఁడ వీని నేలకైకొనవు. నాతోఁ బలుక; వేను గైకకొడుకఁ గాన సంభాషణార్హుండఁ గానో? యిదె చూడు శత్రుఘ్నుండు ధరిత్రింబడి పొరలుచు ధూళిధూసరితాంగుండయియున్న వాఁడితని నాలింగనంబుసేసి లీలం గేల సమ్మార్జనంబు సేయవేల నేము రామునకు ద్రోహులముగా మేల యనాదరణీయులమయితి మనుచుం బనవిపనవి హాహాకారంబు లెసఁగ రోదనంబుసేయ ననేకభంగుల బోధించి యాసమయంబున.

తే. భరతుఁజూచి యారఘువంశగురుఁడు నీవు
తండ్రి కగ్నిసంస్కారాదితంత్ర మింక
ననఘ నడపంగవలయు శాస్త్రోక్తసరణి
ననుడు నగుఁగాక యని లక్ష్మణాగ్రజుండు. 10

వ. మఱునాఁడు సకలమునులను రాజులను రప్పించి వసిష్ఠుం బురస్కరించుకొని దశరథేశ్వరుని కళేబరంబు దివ్యాంబరాభరణగంధమాల్యంబుల నలంకరించి కోటిసంఖ్యాకంబులగు మహిషగోగజాశ్వాదిదానంబు లొనర్చి సువర్ణవిమానంబునం బెట్టికొని యారాజశవంబు పిఱుందం గౌసల్యాది కాంత లాక్రందనంబు సేయుచుం జనుదేర ముందర నగ్నిహోత్రాగ్నిఁగొని భరతుండు వసిష్ఠాది పురోహితులు తోడం గూడరా శత్రుఘ్నసమేతుండయి నడచి యయోధ్యానగరంబు వెడలి సరయూతటంబున సొద పేర్చి యదారాజశవ మిడి త్రేతాగ్నుల నయ్యాయి మంత్రంబుల

విహితావయవంబులఁ బెట్టి సుక్రుక్సువాది యజ్ఞాంగంబుల
నర్హాంగకంబులఁ జేర్చి వేదోక్తమార్గంబున దహించి
తిలోదకదానం బాచరించి నగరి కేతెంచి విహితద్వాద
శాహకృత్యంబులు నిర్వర్తించి కృతకృత్యుండయ్యె నంత
ననంతర దివసంబున. 11

తే. సకలనృపమంత్రి మునిలోక ♦ సమ్మతమున
భరతుఁ గనుఁగొని రఘువంశ♦గురుఁడు రాష్ట్ర
మిట్లరాజకమైయున్న ♦ నెగ్గు దొడరుఁ
గాన నీ వింకఁ బట్టంబు ♦ గట్టికొనుము. 12

చ. అనవుడు నైఁప కిట్లనియె ♦ నక్కటప్రాకృతుఁ డాడునట్టులో
మునివర! నీవు మత్కులస♦ముజ్జ్వలధర్మముఁ జూడకాడెద దే
మని విననేర్తు వీఁడల దు♦రాత్మకురా లగుకైకనందనుం
డనునదిదక్కనాదుమన♦మారసి యొండొకతప్పుచెప్పుమా.

శా. రాముం బుణ్యగుణాభిరాము నెలమిం♦బ్రార్థించి తోడ్తెచ్చెద
క్ష్మామాతికరిమణక్షమాన్వయలస♦త్కీర్తుల్వాలుఁగొండ ను
ద్దామశ్రీకభిషిక్తుఁ జేయుదు రఘూ♦త్తంసంబు రాకున్న నా
భూమీశాగ్రణిఁగొల్చినిల్తునటవీ♦భూమిం దపోవేషినై. 14

వ. అనిపలుక సభాసదులుశిరఃకంపంబుసేయ నక్కుమారుండు.

ఉ. మాతలుమూవురుర్సకల♦మంత్రులుఁబార్థివులుంబురోహి
తవ్రాతముఁ నవ్వసిష్ఠముని♦వర్యుఁడుఁదమ్ముఁడుదోడరా గజా

శ్వాతతసర్వసైన్యయుతుఁ♦డై పురి వెల్వడి యేగుదెంచి గం
గాతటినీతటిన్ విడియఁ♦గా భరతుండను వార్త మోసినన్.

వ. విని గుహుండు సంభ్రమంబున శృంగిబేరపురంబు వెల్వడి
తత్సైన్యంబుం గనుంగొని. 17

సీ. కూరతఁ గైకేయి♦కొడుకు కట్లు తమతల్లి
చేసిన యది మున్న ♦ చెల్లగాన
నంతనె యుండక ♦ యీరాజపరమేశు
పైనెత్తిపోయెడిఁ ♦ బాపచింత
ననుబుద్ధిఁ దనసైన్య ♦ మాయితమై యుండ
గావించి రేవులు ♦ గట్టఁ బనిచి
యేతెంచి భరతుతో ♦ నిట్లని పలికె స
క్కటమహారాజ్యభో♦గములు విడిచి
తండ్రిపనుపు నెఱపఁ ♦ దపస్వియై యడవికి
నేగి యున్న రాఘు♦వేంద్రు వెనుక
సకలసేనతోడఁ ♦ జనుదెంచుచున్నాఁడ
వింతసేయ నాతఁ ♦ డేమిసేసె? 18

ఉ. తమ్ముఁడుఁ దాను నొంటిఁ బడి
తాపసులై వనభూమి నుండఁగా
నిమ్ములఁ గిట్టిపట్టి వధి
యింపఁగఁ బోవుచునున్నవాఁడ వా

యమ్మకుఁ బుట్టినాఁడ వఁట
యక్కట నీతలఁ పేమి చెప్పు; ని
న్ని మ్మొనతోడఁ బోవిడుచు
నే గుహుఁ డిప్పుడు సూడు మంతయున్. 19

క. నీసేన విఱిగి పోవఁగ
నాసురగతి నెత్తువఱద ♦ లడరఁగఁ బటుబా
ణాసారము చూపెద బా
ణాసన మను ఘోషభీష ♦ ణాభ్రమువలనన్. 20

తే. ఏను సమసిన వెనుక నీ ♦ వేఱుదాఁటఁగ
మనిన గుహోక్తులకు సస్మి♦తాస్యుఁ డగుచు
రాముఁ బట్టముఁగట్టఁ గి♦రాతనాథ
తోడితేఁ బోయెదనుగాని ♦ ద్రోహిఁ గాను. 21

వ. అనిన విని సంతోషించి గుహుండు మ్రొక్కి రామచం
ద్రుండు విడిసిన యింగుదీతరువును బర్ణతల్పంబును జడలు
ధరించినచోటునుఁ జూప భరతుండు సూచి విలపించుచుఁ
బదంపడి శత్రుఘ్నసమేతుండయి తానును జటాభారంబుఁ
గైకొని గంగాతరంగిణి దాఁటి యక్కిరాతపతిచేతఁ ద్రోవ
జూపించుకొనుచు నతని వీడ్కొని భరద్వాజాశ్రమంబు
నకుం జని యమ్మునీంద్రునకు నమస్కరించుటయుం గోషం
బున నత్తాపసోత్తముం డిట్లనియె. 22

శా. క్షోణీరాజ్యము నీకు నిచ్చి మునివై ♦ ఘోరాటవీవాటి స
త్క్షీణక్షాంతి వహించి యుండఁగ మహా ♦ సేనాసమేతుండవై

ప్రాణద్రోహము సేయనేగెదవొకో ♦ పాపాత్మ యిట్లాజగ
త్త్రాణుండల్పుఁడె కైకతల్లియఁట నిం♦దంబొంద నీవోడు దే.

చ. అనవుడు నప్పు డాభరతుఁ
డమ్మునిపుంగవు కోపచిహ్నము
ల్గనుఁగొని భీతుఁడై నృపశి
ఖామణి రాముని దోడితెచ్చి భూ
వనితకు నాథుఁజేయుటకు
వచ్చుటగాకిటు ద్రోహచింత నా
మనమున లేదు నాకు నిట
మార్గము సూపు తపోధనోత్తమా. 24

తే. అనిన ముదమంది మునినాథుఁ♦డతనిఁ గాంచి
తగినవిందులు సేయన ♦ ద్దాశరథియుఁ
జిక్కి యారాత్రి మఱునాఁడు ♦ చిత్రకూట
శిఖరితెరువు భరద్వాజు♦చేత నెఱిఁగి. 25

వ. అమ్మునీంద్రు వీడ్కొని చనియె; నంత నక్కడ సీతాసమే
తుండై రామచంద్రుండు చిత్రకూటాద్రియందు విహరించు
చుండి, తత్సేనాకలకలంబులకు బెదరి కనుకనిం బాఱు గజ
మహిషవరాహశార్దూలాది మృగంబులంజూచి యవ్వల
నాలోకించి ధరాపరాగపటలంబునుం గాంచి లక్ష్మణా
యిది యేమొకో మృగంబు లాకులార్తరవంబులతోడం
బఱవం దొడంగె నద్దిక్కునం బెంధూళి యెగసెం జూడు

మననతంబును నధికసంభ్రమంబున నొక్కయుత్తాలపా
దపశిఖారోహణంబు సేసి యుత్తరపథంబునం జతురంగ
బలాకీర్ణం బగు మహాసైన్యంబుఁ గనుంగొని మఱియు నేర్ప
డం బరికించి 26

—♦ భరతుఁడు చిత్రకూటంబున కరుదెంచుట ♦—

చ. తరణికులప్రధానబిరుదధ్వజపఙ్క్తులఁ జూచి సేనతో
భరతుఁడు దాడివెట్టి తముఁ బట్టఁగవచ్చుటఁగాఁ దలంచి ని
ష్ఠురగతి లక్ష్మణుండు ఘనచుంబిమహీరుహశాఖనుండి య
గ్గిరి యగలంగడిగ్గనుఱికెం గులిశాతతపాతమో యనన్. 27

వ. ఇట్లుఱికి యోరామచంద్రా భరతుండుసేనాసమేతుండయి మనమీఁద వచ్చుచున్నాఁడు. నీవుం గవచంబు ధరియించి బాణాసన సన్నద్ధుండవుగమ్ము. కాదేని వైదేహిం దోడ్కొని గిరిగహ్వరాంతరంబున కరుగుము. నీశాంతియ నిన్నింతచేసె; నింక సైరింప; నతని ప్రాణంబులు గొందు; ననిన విని రాఘవేశ్వరుండు కోపించి నాకుఁ దమ్ముండవై యుండియు నింతవినయశూన్యుండవై నీచోక్తులేలయాడెదవు? నీకంటె వాఁడు నాకు భక్తుండు. మనల నయోధ్యకుఁ గొనిపోవు తలంపున వచ్చువాఁ; డయ్యుత్తముని చిత్తవృత్తి యెఱుంగవు; సంభ్రమం బుడుగు; మనిన నమ్మాటలకు వెఱచి సుమిత్రాపుత్రుండు లజ్జావనతవదనుండయి యుండె; నాసమయంబున 28

తే. దూరమున సేన నిల్పి శ♦త్రుఘ్నుతోడఁ
బాదచారియై చనుదెంచి ♦ పర్ణశాలఁ
గాంచి భరతుండు విపులశో♦కమునఁ దనదు
హృదయ మెరియుచు నుండంగ ♦ నిట్టులనియె. 29

సీ. మహనీయ మణిమయ ♦ మందిరంబులనుండు
ప్రభుఁడు నేఁ డున్నాఁడు ♦ పర్ణశాల
మెత్తనిపాన్పున ♦ మే నెత్తు సుఖి నేఁడు
తనువు సేర్చినవాఁడు ♦ దర్భశయ్య
లలితమాల్యంబులు♦లలిఁబూనుపతి నేఁడు
వలనొప్పఁ గయికొన్న♦వాఁడు జడలు
మృదులాంబరంబుల ♦ మెఱయు పుణ్యుఁడు నేఁడు
వలనొప్ప గట్టెను ♦ వల్కలములు

తే. కోరి రాజన్యలోకంబుఁ ♦ గొల్చురాజ
మౌళిమణి నేఁడు మునిసేవ ♦ మరగినాఁడు
వలసె నా కిప్పు డీదుర♦వస్థ చూడఁ
గైకకడుపునఁ బుట్టిన ♦ కారణమున. 30

వ. అనుచుఁ బర్ణశాలఁ జేరం జనుదెంచి రామునిం గని తదంఘ్రిపురోభాగంబున ననుజసమేతుండయి దండప్రణామంబులు సేసిన; నారఘుపుంగవుండు నక్కుమారయుగళంబునుం గ్రుచ్చియెత్తి యక్కునఁ జేర్చి యాలింగనంబు చేసి గారవించెఁ బదంపడి 31

క. జనకజకు సుమిత్రానం
దనునకుఁ బ్రణమిల్లి సముచితస్థితి దర్భా
సనముల నుండఁగ రఘుపతి
యనుజన్ములఁ జూచి సేమమా రాజునకున్. 32

—♦ రామచంద్రుండు దశరథునకుఁ దిలోదకా దిచ్చుట ♦—

వ. అనిన విని డగ్గుత్తిక వెట్టుచు దేవా మీరు విచ్చేసిన యేడవ దివసంబున భవద్వియోగశోకాతురుండయి భూలోకపతి లోకాంతరంబు నొందె నని పల్కుటయు నప్పలుకు లశనిపాతఘోషంబునుం బోలెఁ గర్ణపథంబునం బడిన రామచంద్రుండు మూర్ఛాపరవశుం డయ్యె; జనకరాజపుత్రియు సౌమిత్రియు మృతిఁ బొందిన యట్లుండి; రంతఁ గొంతతడవునకుం దెలిసి లక్ష్మణాగ్రజుం డనేకప్రకారంబుల విలపింపం గనుంగొని 33

క. భరతుం డిట్లనియె నరే
శ్వర ప్రాకృతునట్ల తాల్మి వ్రయ్యఁగ శోకా
తురతం బొందక ధర్మ
స్థిరతం బితృఋణము నీవు దీర్పఁగ వలయున్. 34

వ. అనినం దెలివొంది మందాకినియందు సీతాలక్ష్మణసమేతంబుగా స్నానంబు లాచరించి తిలోదకంబు లిడి విహితద్వాదశాహకృత్యంబులు నడపి బదరీఫలమిశ్రితంబులగు నింగుదీయవపిణ్యాకంబులం బిండంబులు వెట్టి కృత

కృత్యతం బొంది పర్ణశాల కేతెంచి తమ్ములం బట్టికొని
రోదనంబుసేయఁ జిత్రకూటాశ్రయులైన మునులును
యక్ష గంధర్వ కిన్నర కింపురుషులు నేగుదెంచి వారి
శోకంబులు వారించి రాసమయంబున వసిష్ఠుండు కౌసల్యాది
మాతలం దోడ్కొనివచ్చిన వసుధాపుత్రీసమేతుండయి
రఘువరేణ్యుండు సవిత్రుల యడుగులం బడి దెస లద్రువ
రోదనంబు సేయుటయు నచ్చటి యతులధృతులు గలంగఁ
గౌసల్య కొడుకులం గోడలి నెత్తి కౌఁగిలించుకొని
యత్తలోదరితో రోదనంబు సేయ నచ్చట నున్న గరుడ
గంధర్వ కిన్నర కింపురుషాది కాంతలు దురంతదుఃఖంబులం
బొగులుచున్న సీతం గనుంగొని 35

క. జనకుండు తండ్రి దశరథ
జననాథుఁడు మామ రామ ♦ చంద్రుఁడు విభుఁ డ
య్యును నీయబల విపద్భా
జన మైనది దైవగతి క♦సాధ్యముగలదే? 36

క. అని శోకించుచుఁ గైకం
గనుఁగొని ఋష్పాపజాతి ♦ కారణమున ని
వ్వనితారత్నమునకు ని
వ్వనవాసాయాస మొందఁ♦వలసె నటంచున్. 37

వ. పలుకుచుండి రనంతరంబ వసిష్ఠువచనంబుల వారు శోకం
బుడిగి చిత్రకూటాచల[illegible]సు లగు మునీంద్ర కిన్నర

కింపురుష గరుడ గంధర్వ విద్యాధరులతోడ నుచితా
సనంబులం గొలువుండి రఘునందను సభామధ్యంబున నున్న
యనున్న నవలోకించి కేలుమొగిచి భరతుం డిట్లనియె.

సీ. ఒకపాము మోవంగ ♦ నోపు నాభూమినిఁ
బార్థివు ముంజేతి ♦ బలిమిగాక
యిల కెల్లఁ దలదండ ♦ చెలియలి
కట్టయే రాజాజ్ఞ ♦ నబ్ధిపై రాముగాక
వేదంబులా వర్ణ♦వృత్తి కాధారంబు
జనపతిపాలన ♦ శక్తిగాక
యినరశ్ములా వెలుం ♦ గీలోకమున కీశు
దీవ్రతేజో దీప ♦ దీప్తిగాక

తే. గొడుగువిరిగిన ధారుణి ♦ గూలునబ్ధి
మేరదప్పు వర్ణాశ్రమా ♦ చార మడఁగుఁ
గలయ దిఙ్మోహ మగు నట్లు♦గాకయుండ
భూరిధారుణిభారంబు ♦ పూను మధిప. 39

తే. దేవ నాకేయి కీడు చిం ♦ తించి పాప
నింద కింతయు రోయక ♦ నిన్ను నడవి
కరుగు మనియన్నమాటకు ♦ నరుగ ధర్మ
మగునె విచ్చేయు మీ తెంపు ♦ దగునె సేయ ? 40

ఉ. నీదగురాజ్యలక్ష్మి ధర♦ణీవర యేను ధరింపజాల ని?
త్యోదయసంపద లొప్పదలు♦చుండఁ బ్రజాపరిపాలనక్రియా

పాదనలీలతో భువన♦భారముఁబూనఁగ నేగుదె మ్మయో
ధ్యాదయితత్వ మన్యులకు♦నర్హ ముగా దటుగాక తక్కినన్.

—♦ భరతుఁడు రాముపాదుకలుగొని నందిగ్రామంబున వసియించుట ♦—

వ. ఇదె మీముందటఁ బ్రాయోపవేశంబు సేయుదు నని దర్భాస్తరణశాయిగానున్న నన్నరేంద్రుఁ డెత్తి యాంత ప్మునిం గౌఁగిటం జేర్చి యిది యేమి భరతా మనకులాచార ధర్మంబులు విచారింపక యాడుచున్నావు; నాయట్టికొడుకు దశరథునట్టితండ్రిసత్యంబు పాలింపఁడేని లోకం బెట్లు నడచు? నేను వ్రతంబు సంపూర్ణంబైనమీఁద నయోధ్యకు వచ్చెద; నీచలం బుడుఁగు మనవుడు రావణవధంబు గోరుచున్న కిన్నర కింపురుష గరుడ గంధర్వ మునీంద్రాదులనాగతవృత్తాంతం బెఱింగి యవ్వాక్యంబులకు సంతోషించి రక్కుమారుండును జింతాక్రాంతుండగుచు మొగంబు వాంచిన వసిష్ఠుండు రామచంద్రునితో నిట్లనియె.

చ. భరతుఁడు భక్తియుక్తినినుఁ♦బ్రార్థనసేయుచునున్నవాఁడు నీ
వరయఁగ భక్తవత్సలుఁడ ♦ వట్లగుటం గృపతోడ మేదినీ
భరము భరింప నీతొడుగు♦పాదుకలానతియిమ్ము నావుడున్
గురువచనంబు మీఱక ర♦ఘుప్రవరుం డటుచేసితమ్మునిన్

చ. ప్రియముడరంగ వీడుకొలి♦పె న్మదినప్పుడు రామచంద్రు ని
శ్చయము తెఱంగెఱింగి రఘు♦సత్తము చిత్తమునొచ్చు

నంచుఁ దా

భయమున నోర్తిరియొండొకటి॥పల్కక సానుజుండై దివాకరా
న్వయపతికిం బ్రదక్షిణము॥వచ్చి నమస్కృతిచేసి భక్తితోన్.

వ. ఇట్లుచితప్రకారంబున వీడుకొని మస్తకంబున నప్పాదు
కలు ధరియించి చని శత్రుంజయం బను పట్టపేనుంగు
కుంభస్థలంబునం బెట్టి తానును శత్రుఘ్నుండును నిరు
కెలంకుల ఛత్త్రచామరంబులు ధరియించి సమస్త పరి
జనంబులుం దానును జిత్రకూటంబు వెడలి భరద్వాజుని
కంతవృత్తాంతంబునుం జెప్పుచు గుహుని కెఱింగించుచు
నేతెంచి యయోధ్యానగరంబు సొచ్చి తల్లుల నంతః
పురంబునకుం బుచ్చి మూలబలంబు నగరికాపు వెట్టించి
రామశూన్యం బగు నప్పురంబున నుండరోసి సమస్త
మంత్రిజనానుమతంబున నందిగ్రామంబున. . 44

చ. అఖిలనృపాలలోక మరు॥దంద నిజాన్వయకీర్తిచంద్రికల్
నిఖిలము గప్పి యొప్ప నయ॥నిర్భరతన్ భరతుండు పాదుకా
ముఖమున రాజ్యభారము స॥ముజ్జ్వలభంగి వెలుంగ భూప్రజా
సుఖములొనర్చుచుం డెగుణ॥సుందరుండగ్రజు శాసనంబునన్.

---

## భీమేశ్వర పురాణము.

# వ్యాసమహర్షి కాశి విడచుట.



[కవిసార్వభౌమ బిరుదాంకితుఁడగు శ్రీనాథ మహాకవి ప్రౌఢవయస్సులో వ్రాసిన భీమేశ్వరపురాణము ఆతని గ్రంథములలో నుత్తమమైనది. ఇందు వ్యాసమహర్షి కాశి విడచు ఘట్టము రసవత్తరమైనది. ఈ కథాంశమే కాశిఖండము నందును గలదుగాని ప్రకృత కథాభాగము విపులము మనోహరము నై యున్నది. శైలిమాత్రము కొంతవఱకుఁ గఠినము.

శ్రీనాథుఁడు క్రీ. శ. 1396 ప్రాంతమునుండి విద్యాధికారిగనుండి పేరెన్నిక నొందెను. దాదాపుగ క్రీ. శ. 1450 వఱకీకవి జీవించి విద్యాపరీక్షలలో విజయమునొంది యాంధ్ర దేశమున నఖండగౌరవము నొంది ప్రసిద్ధుఁడయ్యెను. ఈయన కవితలో నొక పాలు తెనుఁగు పదములు మూఁడు పాళ్ళు సంస్కృతపదము లుండును. తరువాత కవులందఱును శ్రీనాథుని ననుకరించి సమాసజటిలముగఁ గవిత వ్రాయదొరకొనిరి.

శ్రీనాథుని జీవితమునకు సంబంధించిన వివరములు తెలుపు పాఠము ప్రత్యేకించి యిందుఁ జేర్చితిమి. విశేషాంశ ము లందుఁ గాంచనగును. అగస్త్యమహర్షి వ్యాసునిఁ జూచి

కాశీనగరమును విడిచిన కారణముఁ దెలుపు మనుటతోఁ బ్రకృతకథ యారంభ మగుచున్నది.]

—♦ అగస్త్యుఁడు వ్యాసమహర్షిఁ గాశిఁ బాసివచ్చుటకుఁ గారణం బడుగుట ♦—

తే. ఆననమునందు వైవర్ణ్య ♦ మగ్గలించెఁ
గన్నుఁగవయందు దైన్యంబు ♦ గానఁబడియె
నార్తి నేదేని యొకటి నీ♦యంతరంగ
మూనియున్నది యిది యెట్లొ ♦ లోకొక్క యనఘ. 1

సీ. లోలార్కునకు నీకు ♦ లోలోన నేమేనిఁ,
బోటుపుట్టదు గదా ♦ మాటమాట
వెనకయ్య శ్రీపంత ♦ విఘ్నేశ్వరస్వామి
ధిక్కరింపఁడు గదా ♦ తెగువ నిన్ను
నాఁకొన్న నిన్ను మ♦ధ్యాహ్నకాలంబున
నరయకుండదు గదా ♦ యన్నపూర్ణ
నెపమేమియును లేక ♦ నీయెడాటమ్మునఁ
బాటిఁదప్పఁడు గదా ♦ భైరవుండు

తే. ఎట్లు బాసితి మిన్నేటి ♦ యిసుకతిప్ప,
లెట్లుపాసితి వాస్థలం ♦ బేనుకోస.
లెట్లుపాసితి వవిముక్త♦హట్టభూమి
యెట్లుపాసితి విశ్వేశు ♦ నిందుధరుని.

క. కాశీనందన కంతే
కాలురశిరములకు విరులు ♦ కల్పించునాకో

లీలావనాంతరమునను
మాలోపాముద్ర యుడిన ♦ మల్లీవల్లుల్. 3

శా. ఆమందాకిని యాత్రివేణి వలనం♦బాబాహ్యకక్ష్యాస్థలం
బామధ్యాంతరకక్ష్య లావిమల ది♦వ్యజ్యోతి రుజ్జృంభణ
శ్రీమద్విశ్వపతీశలింగము మదిం ♦ జింతింపఁ గాశీమహా
గ్రామం బిప్పుడు నాకనుంగవకు సా♦క్షాత్కారముం గైకొనున్.

శా. ఆనందంబున నర్ధరాత్రములఁ జం♦ద్రాలోకముల్ కాయఁగా
నానాసైకతవేదికాస్థలములన్ ♦ నల్దిక్కులన్ శంభుఁ గా
శ్రీనాథున్ దరుణేందుశేఖరు శివున్ ♦ శ్రీకంఠునిం బాడుదు
న్నేనెల్లం బులకాంకురప్రకరముల్ ♦ నిండార మిన్నేటిలోన్.

క. గంగాయమునాతీరో
త్సంగమునఁ బ్రియాగను స్స♦దాశివు విశ్వే
శుంగూర్చి తపముసేసితి
నంగుష్ఠము ధరణిమోపి ♦ యతిఘోరముగన్. 6

తే. విస్మయము నాకు మదిలోన ♦ విస్తరిల్లెఁ
బరమధర్మజ్ఞ కాశికా♦పట్టణమున
నుండ మూఢాత్ముఁడైనను ♦ నొండుకడకుఁ
బోవఁ దలఁపఁడు నీ కెట్లు ♦ బుద్ధిపుట్టె ? 7

వ. అనినఁ బారాశర్యుండు వాతాపిదమనున కిట్లనియె. 8

— వ్యాసులు తాను గాసిఁబాసిన కారణంబుఁ జెప్పుట :—

చ. సమధికసత్కవీశ్వరులు ♦ జైమినిపైలసుమంతులాదిగా
శమదమసద్గుణాన్వితులు ♦ సాధులుశిష్యులుతోడఁగూడిరాఁ
గ్రమమునక్షేత్రయాత్రకు ధ ♦ రాతలమందఖిలంబుద్రొక్కి భా
వము భవభక్తియుక్తముగ ♦ వచ్చితిఁ గాశికితిఁ బుణ్యరాశికిన్.

క. ఏమిశకునమునఁ జొచ్చితి
మో మన్మథదమను వీ డ ♦ హోరాత్రంబుల్
మేమేడునాళ్ళ దనుకను
స్వామీ! యుపవాసముండి ♦ జడిసితిమి మదిన్. 10

క. గేహములకేగి భిక్షాం
దేహి యన స్త్రీట నొక ప ♦ తివ్రతయైనన్
సాహార్ద్రంబునఁ దెద్దెం
డాహారము పెట్టదయ్యె ♦ నా దినములలోనే. 11

శా. శ్రీవిశ్వేశ్వరదేవదేవుని కృపా ♦ శ్రీచేదివోదాసు బా
హావిశ్రాంతబలంబుచేత ధవళ ♦ న్యాయప్రజావృద్ధినో
ప్పె విశ్రామముగల్గి సుస్థిరతరం ♦ బైయుండి భాసిల్లఁగా
నీ వారాణశిలోన భిక్షకఱవ ♦ య్యెంజూడుమీ కుంభజా. 12

శా. వైశంపాయనుఁడెంతయున్ సుడివడె ♦ న్వాడెన్సుమంతుండతి
క్లేశంబందిరి పైలజైమినులు దుః ♦ ఖించెన్ మదిన్ దేవలుం
డాశాంతంబులుచూచెదాల్భ్యుఁడుదరో ♦ దగ్రక్షుధాక్షోభ చేఁ
గాశీపట్టన విప్రవాటికల భి ♦ క్షాలబ్ధి లేకుండుటన్. 13

తే. అక్కటా యేమి చెప్ప వింధ్యాద్రిదమన
కాశిలో నేడునాళ్ళు నిష్కారణంబ
శిష్యులును నేను నిట్లుపవాసంబు వడితి
మమర గాంగానదీ సైకతములయందు. 14

వ. అష్టమదివసంబున నరుణోదయకాలంబున గంగాపులినోత్సంగంబులం గుశశయనంబున మేలుకాంచి యభ్యుదితంబైన మార్తాండమండలం బాఖండల దిశావేదండకంఠగ్రైవేయకనకఘంటికాఠంకారంబునుం బోలె నుదయగిరిశిఖరతటసవిధంబునఁ గుంకుమరజస్త్రసరేణువిసరంబునుం బోని నిగనిగనునుజిగిగీలుకొని కోమల జిలుఁగుజిగికొనలు గగనతల మలమికొనుకొలఁది మణికర్ణికాంభఃప్రవాహంబున నఘమర్షణస్నానం బాచరించి యత్తీరవాసి జనవిరచితవాలుకాలింగంబులకుఁ బీఠార్చనా శంభులింగంబులకును మంత్రాక్షత పుష్పకపూర్వకంబుగా నభివాదనంబుఁ జేసి పంచబ్రహ్మపంచాక్షరీమంత్రపరిధానంబులు జపియించి సిద్ధమునిపరంపరాసంకులంబైన ఘంటాపథంబునం గంగాబహిర్గేహదేహళీ విభాగంబును నంతర్గేహసౌధవీథి కాట్టకుట్టిమప్రఘణంబును గడచి లోలార్క కాలభైరవ ఢుంఢి వినాయక విశాలాక్షి ప్రముఖ పరివారదేవతాకోటికి వేడికోళ్లు సమర్పించి విశ్వేశ్వరు విరూపాక్షు సక్షణమోక్షలక్ష్మీసామ్రాజ్య సింహాసనారూఢుం దారకోపదేశదేశికు

దాక్షిణ్య పుణ్య కరుణాకటాక్షవీక్షాపేక్షునిఁ బ్రదక్షిణ
క్రమదండప్రణామపురస్సరంబుగా సేవించి ముక్తిమంట
పంబునఁ గొంతతడవుండి మధ్యాహ్నకాలం బగుట నిరూ
పించి భిక్షాపాత్రంబులఁ గేలంబూని యతికఠోరజఠర
క్షుధాగ్నితాపంబునకుఁ దోడగు తపనమయూఖప్రచండకిరణ
కాండప్రకాండంబులు నెత్తి మండింప, లేదు నడువుండు
పొండు కూడ దను నిషేధవాక్యంబులు చెవులు నిండికొన
విప్రవాటంబులఁ బ్రతిగేహంబును బరిభ్రమించి విసికి విసి
మాలి వేసరి యలసి యారట బొంది సొలసి జూఁకించి సూలి
దూఁపటిల్లి యుల్లంబునఁ గ్రోధం బుద్భవించిన. 15

శా. కుక్షిప్రోద్భవనిష్ఠురక్షుధితదు ♦ ర్ఘోరాంధకారంబునం
జక్షుల్ రెండును జిమ్మచీఁకటులుగా ♦ సంరభశుంభద్గతిం
బ్రేక్షచ్ఛాత్రులు భీతిఁ బొందఁ గడును ♦ ద్రేకించి హట్టంబునన్
భిక్షాపాత్రము రాతిమీఁద శతధా ♦ భిన్నంబుగా వైచితిన్.

క. అటు పౌరవీధి చక్రటిఁ
బటుకున బడవైచి క్రోధ ♦ పరిపాటిమెయిం
గటము లదరంగ భ్రూకుటి
నిటలములను జెమటనీరు ♦ నిండ ఘటిల్లన్. 17

క. ఏమి యని చెప్పుదును లో
పాముద్రాప్రాణనాథ! ♦ ప్రజ్ఞావిభవం
బేమోయయి చెడిపోవఁగ
నామది నెన్నండు లేని ♦ నైచ్యము పొడమెన్. 18

ఏలా విచారింప ♦ నిందు రేఖామౌళి
వివిధమౌక్తికధాతు ♦ విశ్వనాథు
నేలా వితర్కింప ♦ హిమశైల శేఖరో
త్క్షీణకౌశేయంబు ♦ సిద్ధతటిని
నేలా పరీక్షింప ♦ నిభరాజవదనుని
దుంఠివిఘ్నేశు మం♦డూకజఠరు
నేలా విలోకింప ♦ బ్రీళాకళాశూన్య
కటిఁ గాలభైరవు ♦ వటుకనాథు

తే. నిఖిల కైవల్య కల్యాణ ♦ నిలయమైన
కాశిపైఁ గూడు లేకుండు ♦ కారణమున
నలిగి శపియింపఁగాఁ బూని ♦ యందుకొంటి
ధృతకమండలు భాగీర ♦ థీజలంబు. 20

ఉ. కోపము సంహరింపు ముని ♦ కుంజరయంచు లలాటదేశసం
స్థాపితపాణిపద్మయుగ ♦ సంఘటితాంజలిబంధులై మహా
తాపసశిష్యబృందములు ♦ ధర్మపథంబును దెల్పి చెప్పఁగా
శాపజలంబు పూనితిఁ బ్ర♦శాంతివిహీనత నేమిచెప్పుదున్.

వ. ఇవ్విధంబున సప్తవాసరోపవాసాయాస సంభూతప్రభూత రోషావేశంబున నంగుళీపవిత్ర సనాథంబైన హస్తంబున మణికర్ణికాజలంబులు ధరియించి యిట్లని శపియింప నుద్యోగించితి. 23

—♦ వ్యాసులు కాశిని శపింపఁబూనుట ♦—

శ్లో. మాభూ త్త్రైపురుషీవిద్యా, మాభూత్త్రైపురుషంధనమ్
మాభూ త్త్రైపురుషీభక్తిః, కాశ్యాం నివసతాం సదా.

తే. అని శపింపఁగఁ బూను న♦య్యవసరమున
నేమి చెప్పుదు నోసంయ♦మీంద్రవంద్య!
యుదిలగొని కంపమందుచు ♦ నుండెఁ గాని
శాపజలమందుకోఁ గేలు♦సాఁగదయ్యె. 24

వ. ఆసమయంబునఁ గాశికానగరసోమవీధికాభవనవాటికా మధ్యంబున నొక్కయింటి మచ్చకంటి పంచాశద్వర్షదేశీయఫలితసారంబైన వేణికాభారంబు గైవడ ముదుసలి చక్రవాకంబులతో నెకసక్కెంబాడు పీఁగుచన్నుల వ్రేఁగుదనంబునఁ దన తనూవల్లి జలదరింపఁ గంకణఝణఝణత్కారంబు దోరంబుగాఁ గ్రక్కున గోపురద్వారంబు బోరుతలుపు వాయందట్టి యందియలరవళితోడం గూడి మట్టియల మ్రోఁత త్రిభువనంబులు నురుజ గొనం దేరుగడుప యోలం జరణపల్లవంబుఁ జాఁచి యనంగధ్వజపటకఠోర పాఠీనచ్ఛాయాదాయాదంబులైన వెడఁదకన్నులు తలచుట్టునుం బలిసి పొలయ కలమధురవీణాక్వాణపాణింధమంబైనయెలుంగునెత్తి యోబ్రాహ్మణోత్తమా! శాపము సంహరించి యిటురమ్మని నన్నుఁ జేరంబిలిచిన

సంతసమంది యే నపుడు ♦ శాపజలంబులు పాఱఁజల్లి వే
దాంతవచోమహోపనిష♦దర్థమయీ శుభరూపవృద్ధసీ
మంతినిఁ గాశికానగర♦మధ్యనివాసిని విశ్వనాథుశు
ద్ధాంతము డాయఁబోయితిఁ బ్రి♦యంబును భక్తియునుం
దలిర్పఁగన్. 26

డాయఁబోయి యప్పు ♦ డాయమ్మ యెవ్వరో
యేకులంబునదియొ ♦ యెఱుఁగకయును
నే జొహారు నిడితి ♦ హృదయంబ నేరుచు
నెమరు ప్రాభవంబు ♦ నేర్పరింప. 27

వ. అంత నన్నుం జేరఁబిలిచి యక్కాంత యిట్లనియె. 28

తే. భిక్ష లేదని యింత కో♦పింతురయ్య ?
కాశికాపట్టణము మీఁద ♦ గాని నేయ
నీమనశ్శుద్ధి దెలియంగ ♦ నీలకంఠుఁ
డింతచేసెనుగాక కూ ♦ డేమి బ్రాఁతి. 29

తే. శ్రీవిశాలాక్షి బంగారు ♦ తెడ్డునందు
నమృతపాయస మొసఁగు న♦భ్యాగతులకుఁ
గాశికాపురి మధ్యాహ్న ♦ కాలమనఁగ
వినియు నెఱుఁగవె యాతిథ్య♦వేళలందు. 30

ఉ. ఏడుదినంబు లన్నమున ♦ కెడ్డము పుట్టిన యంతమాత్రలో
నేడుచుచున్న వాఁడవు ము♦నీశ్వర! నేఁడును నీదు ధీరతల్

పాడఱిపోయెనే శివుని♦భార్యకుఁ గాశికిఁ బుణ్యరాశికిం
గాడునొనర్పఁజూచెదవు♦కంఠపుఁగ్రోధము పెచ్చుపెచ్చుగన్.
ఉ. కొన్నిదినాలఫుప్పుదాల్పునకుఁ♦గూరిమిభోగపురంధ్రికక్కటా
యిన్నగరీలలామమున ♦ కీపరిపాటికి నిట్టికోప మే
లన్న! ఘటించెదో మునికు♦లాగ్రణి నిక్కము వో "బుభుక్షితః
కిన్నకరోతిపాప"మను ♦ కేవలనీతిఁ దలంచిచూడగన్. 32
తే. కాశిపైఁ గోపగింపఁగఁ ♦ గాదు నీకు
నెంత కోపించునో యింత ♦ కిందుమౌళి
విప్రుఁడవు గాన నేరము ♦ వెదకఁ దగదు
భిక్షుఁ గొనరమ్ము మాటలు ♦ పెక్కు లేల? 33
వ. అనిన నవ్వ్యాలుఁగింటికి నిట్లంటి. 34
శా. తల్లీ! యిన్నిదినాల కేనియు సుధా♦ధారా రసస్యందియై
యుల్లంబుల్ సుఖయింపఁ జేయు పలు కె♦ట్లో వింటి నివ్వేటిలోఁ
బెల్లాఁకొన్నతనాన నేనొకఁడనే ♦ భిక్షానకుల్ వత్తునో
యెల్లన్ శిష్యులఁగొంచువత్తునో నిజం♦బేర్పాటుగాఁ జెప్పుమా.
తే. ఈవు పెట్టిన భిక్ష మే♦మిందఱమును
బంచుకొని చేయువారము ♦ ప్రాణరక్ష
నాతి! యందఱవియును బ్రా♦ణములు కావె?
నాయదియె ప్రాణ మని వత్తు♦నా! భుజింప. 36
వ. అనిన మందస్మితవదనారవిందయై యయ్యిందుబింబానన
యిట్లనియె.

శా. అంతేవాసులునీవుఁగూడుకొనిమ♦ధ్యాహ్నాభిషేకక్రియల్
శాంతస్వాంతత జాహ్నవిం♦జలిపి వేల్చన్ రండు నేనింతలో
నంతస్నేహమునన్ సమగ్రముగ మీ ♦ కాహారము ల్వేగఁ గ
ల్పింతున్ భోజనమిష్టమిందరకుఁ దృ♦ప్తిన్ బొందఁగాఁ బెట్టెదన్.

క. ఆఁకొంటి రిన్నిదినములు
సోకంతయు భిక్ష నీటఁ ♦ బుట్టక యునికిన్
ఆఁకట దూకట నలిగితి
రేఁకట వాయంగ భిక్ష ♦ లిడియెద రండీ. 39

వ. అనిన నేమును వియల్లోకకల్లోలినికిం జని యాప్లవనం బాచ
రించి యుభయపవిత్రంబులు ధరియించి వేదంబులు పఠి
యించుచు వచ్చి యమ్మచ్చకంటి యింటి మొగసాలఁ
గూర్చుంటిమి. 40

క. మున్నాఁడు శిష్యులును నే
నన్నెలఁతుకతోడ మాట ♦ లాడిన యయ్య
భ్యున్నతసౌధముమీఁదను
సున్నము నిగిడించినట్టి ♦ జోడరుగులపై. 41

వ. ఉండి యాసారపరిసారంబులు చేయు శంభళీజనంబుల
చేతను మారాకు మొఱంగించిన నబ్బోటి హాటకమయం
బైన గొడుగు పావలు గిలుకలు గులుకరింపఁ గుసుమ
కోదండసమ్మోహనకాండంబునుఁ బోని యొక్క రెండ
వవయసు తాంబూలకరండవాహినిం గైదండ పట్టి

కొని యేతెంచి రండు విచ్చేయుఁ డని సబహుమానం
బుగాఁ దోడ్కొనిపోయి చంద్రికాసంకాశ కౌశేయశత
సహస్రసందానితవితానోపశోభిత బును, గాలాగురుధూప
ధూమవాసనాసనాథంబును, గర్పూరరచితరంగవల్లీవేల్లి
తంబును, గస్తూరికాలేపనసురభి శశికాంతమణిశిలాకుట్టి
మంబును నగు చతుశ్శాలాభోజనమందిరంబున వృద్ధా
నుపూర్వకంబుగ నుచితాసనంబులం గూర్చుండ
నియమించిన 42

క. మొగి విరిసి కఱకుగూడక
పగులక వెడలుపును నిడుపుఁ ♦ బసిమియుఁ గల లేఁ
జిగు రరఁటాకులు పెట్టిరి
దిగదిగ నద్దేవియాజ్ఞ ♦ దివ్యపురంధ్రుల్. 43

వ. అనంతరంబ. 44

తే. అర్చనలు చేసి గంధ పు ♦ ష్పాక్షతముల
ధూప మిచ్చెఁ గాలాగురు ♦ ధూమరేఖఁ
గప్పురంబు నివాళించెఁ ♦ గమలనేత్రి
పంక్తి పంక్తికి నేతెంచి ♦ బ్రాహ్మణులకు. 45

ఉ. ఇందఱుఁగూడి శాంతి పఠి♦యింపుఁడు మజ్జనమాచరింపు డ
ర్థేందుకళాకిరీటునకు ♦ నీయమృతాన్నము లీపదార్థముల్
మందగతిం భుజింపుఁడు స♦మస్తజగత్పతి కాశికాపురీ
మందిరవిశ్వనాయకుఁ డు♦మాపతి ప్రీతి వహించుగావుతన్.

వ. అని పంక్తిపంక్తి నడుమ నిలుచుచు, నయ్యింతి భక్తిశ్రద్ధా
తాత్పర్యవిశ్వాసపూర్వకంబుగా నుర్వీగీర్వాణవర్గంబులం
బ్రార్థించుచు నాపోశనంబులు వోయించుచుండె నప్పుడేను
పైల సుమంతు జైమిని వైశంపాయనాది శిష్యపరికరంబు
నెమ్మనంబుల నిట్లని వితర్కించుచుంటిమి 47

ఉ. వండినచొప్పునుం బాగపు♦వాసనయుం బాగపాఱుచందమున్
భాండసమృద్ధి సంపదయుఁ♦బానవిభూతియు సర్వమంగళం
బండజయాన రిత్తప్రియ♦మాడెడు నేఁడును భోజనంబు లే
కుండుటగాననయ్యెనసి♦తోత్పలగంధియు నేమిమాయయో

ఉ. చల్లనిసౌమ్యదృష్టియుఁ బ్ర♦సాదము మాధురియు న్వివేకము
న్వెల్లఁదనంబు మార్ధ్యమును♦నిర్మలినత్వముఁ జూడవచ్చినం
గల్లయొకింతయేనిఁ బొడఁ♦గానఁగరా దరటాకుఁజూచినన్
ఝల్లనెగుండె యోగిరము♦శాకములుం బొడగానరామికిన్

తే. పాత్రసంశుద్ధి కాజ్యంబు♦పస్తరించి
యూరకుండిరి యిదియేమి♦యొక్కొ వీరు
కానరా విప్రు శాకపా♦కములు నెదుర
మనకు నిజమయ్యె నల చంద♦మామఘుటిక. 50

మ. అవుగా కేమి నిజంబు తేటపడఁగా ♦ నర్చించె గంధాక్షతా
ది విశేషంబుల శాంతిపాఠమును సం♦దీపించె విశ్వేశ్వరున్
శివునుద్దేశము చేసి మ్రొక్కి వివిధా♦శీర్వాదముల్ గైకొనెం
ధవళాంభోరుహనేత్రయింతయును మి♦థ్యాదృష్టిగా నేర్చునే.

క. కానీ యీదివసంబును
నే నిన్నఁటి యట్లకాక ♦ యేమనఁగ నపో
సానంబులు వడ్డించిరి
మానవతీజనులు లీల ♦ మహీదివిజులకున్. 52

తే. పోసి రామెల్లవారి కా♦పోశనములు
నారగింపుఁడు లెండు మీ ♦ కమృతమస్తు
ప్రొద్దుపోయెనుజుఁ డని ♦ బుజ్జగించి
మ్రొక్కి యంజలియెత్తె న♦మ్మృదుకపణఁతి. 53

శా. ఆముత్తైదువయాజ్ఞ విప్రనికరం ♦ బాపోశనంబెత్తినన్
సామర్థ్యం బది యెట్టిదో నిఖిలమున్ ♦ సంపూర్ణమై పత్రపా
త్రీమధ్యంబునఁ బిండివంటకములుం ♦ దివ్యాన్నముల్ షడ్రసీ
సామగ్రీరుచిమత్పదార్థచయము ♦ ల్సంధిల్లె నొక్కుమ్మడిన్.

ఉ. పప్పునుబిండివంటలును ♦ బాయసముల్ ఘృతముల్గుడంబులుం
గుప్పలుగాఁగఁజుట్టునను ♦ గూర్పఁగఁగూడిన యేరుఁబ్రాలతె
ల్గప్పురభోగివంటకము ♦ గమ్మని తాలిపు సాజ్జపిండితో
నొప్పులుగాభుజించిరిబు ♦ ధోత్తములాఁకటిచిచ్చు పెచ్చునన్.

క. తరుణి యిది యన్నపూర్ణా
పరమేశ్వరి గాని యితర ♦ భామిని గాదం
చరవాయి గొనక మెసఁగిరి
పరమమునీశ్వరులు పంచ ♦ భక్ష్యాన్నంబుల్. 56

శా. ద్రాక్షాపానకఖండశర్కరలతో • రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెఁగలతోఁ • గ్రొన్నేతితోఁ బప్పుతో
నక్షయ్యంబగు నేరుఁబ్రాల కలమా • హారంబు నిశ్శంకతం
గుక్షుల్ నిండఁగ నారగించితిమి య • క్షుద్రక్షుధాశాంతికిన్.

ఆ. ఎవ్వఁ డేపదార్థ • మొం దేనిఁ జింతించు
నతని కా పదార్థ • మంత గలిగి
మరఁటియాకు మీఁద • నవతారమై యుండు
నిట్టి మహిమ చూడ • మెన్నఁ డేని. 58

ఉ. వేలుపుగిన్నియుం బసన • వేదియుఁ గల్పకుజంబుఁ దోడ రా
లాలితపాదనూపురఝు • ళంఝుళనాదము లుల్లసిల్లఁ బైఁ
జేలచెఱంగు దూలఁగ వి • శృంఖలవృత్తిఁ జరించుచుండె నీ
లాలక యన్నపూర్ణ యమృ • తాన్నముఁ బెట్టుచు నన్ని
పంక్తులన్. 59

వ. ఇవ్విధంబున నాజ్యధారాప్రవాహంబును, శర్కరాక్షోద సికతాంచితంబును, పాయసాపూపసంపన్నంబగు కలమాన్నపూర్ణంబును, ద్రాక్షాగోక్షీరక్షౌద్రపుండ్రేక్షుఖండ మండితంబును, రంభానారికేళ ఫలపాకశాక సాకల్యకల్యం బును, షాడబరసావపానకప్రచురంబును, శరచ్చంద్ర చంద్రికాధవళదధిసమృద్ధంబును నైన భోజనోత్సవంబు వైశంపాయనమనఃప్రమోదసంపత్సంపాదనలంపటంబును సుమంతుసంతోషకారణంబును పైలరసనాతపఃఫలంబును

ప్రేమిసితి మనఃకామధేనువును, దేవలఃసుదావహంబును,
రోమహర్షణహర్షోత్కర్షావహంబును, సూతకౌతూహల
హేతుభూతంబును, నస్మన్మనోరథవిహారఘంటాపథంబును
నై ప్రవర్తిల్లెం దదనంతరంబ.

ఆ. హస్తములను గడిగి ♦ యాచమనక్రియా
వ్యాప్తి దీర్చి దేవి ♦ యాజ్ఞ మేము
విమలసౌధమధ్య ♦ వేదికాస్థలమున
విశ్రమించియున్న ♦ వేళయందు. 61

వ. అభ్యంతరభవనంబునందుండి. 62

విశ్వనాథుండు పార్వతితోడ వ్యాసాదులుండిన వేదికకడకు విజయముచేయుట.

సీ. చంద్రబింబానన ♦ చంద్రరేఖామౌళి,
నీలకుంతలభార ♦ నీలగళుండు
ధవళాయతేక్షణ ♦ ధవళాఖిలాంగుండు
మదనసంజీవని ♦ మదనహరుండు
నాగేంద్రనిభయాన ♦ నాగకుండలధారి
భువనమోహనగాత్ర ♦ భువనకర్త
గిరిరాజకన్యక ♦ గిరిరాజనిలయుండు
సర్వాంగసుందరి ♦ సర్వగురుఁడు

తే. గౌరి శ్రీవిశ్వనాథుండు ♦ కనకరత్న
పాదుకలు మెట్టి చెట్టలు ♦ పట్టికొనుచు
నేగుదెంచిరి యొయ్యార ♦ మెసక మెసఁగ
విహరణక్రీడ మాయున్న ♦ వేదికపుడు. 68

తే. జయయువిజయయు నొకవంక ♦ సరస రారు
నందికేశుండు ముందర ♦ నడచిరాఁడు
ప్రథమదంపతులేమి సం♦భ్రమము లేక
యరుగుదెంచుట యద్భుత ♦ మయ్యె మాకు. 64

శా. గౌరింజూచినయప్పు ♦ డంచిత మహాకారుణ్యసంపత్తియుం
దారానాయకమౌళిఁజూచినపు డుద్యత్క్రోధ సంరంభముం
దోరంబై యపుడంతరంగముల సం♦తోషంబుసంత్రాసముం
బూరించెన్విను మేమి చెప్పుదుమహా♦పుణ్యాత్మ కుంభోద్భవా.

తే. కాశి శివునకు శుద్ధాంత♦కాంతగాన
దానిపై నల్గి కోపపా♦త్రంబ నైతిఁ
గాశి గౌరికి సవతియౌఁ ♦ గాన నేను
దానిపైనల్గి ప్రేమపా♦త్రంబ నైతి. 66

వ. అనంతరంబ యేము ప్రత్యుత్థానంబుచేసి యాపురాణదంపతులకుఁ బ్రణామంబు లాచరించి మడిసందులం జేతులిడి మొక్కి కెలన నిలిచి యుండితిమి. పార్వతీపరమేశ్వరులు వేదికాస్థలంబున విజయంచేసి కూర్చుండిరప్పుడు శంభుండు కోపసంరంభంబున నాదిక్కుచూచి ధిక్కరించియిట్లనియె.

— ♦శంభుండు వ్యాసుని శిష్యులతోడఁ గాశి వెడలిపొమ్మనుట♦ —

సీ. ఓరి దురాత్మ! నీ♦వారముష్టింపచా
భాస! యోజనగంధి♦ప్రథమపుత్ర
దేవరన్యాయ దు♦ర్భావనాపరతంత్ర
బహుసంహితావృథా♦పాఠపఠన!

భారతగ్రంథగుంభన పండితంమన్య
నీవా మదీయప♦త్నికి నశేష
కైవల్యకల్యాణ♦ఘంటాపథమునకుఁ
గాశికాపురికి ని♦ష్కారణంబ

తే. శాపమిచ్చెద నని యనా♦చారసరణి
నడుగువెట్టినవాఁడ వ♦హంకరించి
పొమ్ము నిర్భాగ్య! మాయూరి ♦ పొలము వెడలి
యిచటికేన్ శిష్యులును నీవు ♦ నీక్షణంబ. 68

క. పోక నడగొట్టి తేనియు
రాకింతుఁజుమీ మొగంబు ♦ రాచట్టుపయిన్
శ్రీకాశిక నిందించిన
నీ కింతట నేల పోవు ♦ నీచచరిత్రా. 69

క. వడి విడువక యివ్వడువున
నుడుపతిమకుటుండు చెవుల ♦ కొనరని నుడుగుల్
నొడివిన నే నయ్యుగువుర
యడుగులఁ బడి కాశి వెడలి ♦ యరిగెదు వేళన్. 70

చ. వెఱవకు మో కుమార! పది♦వేలవిధంబులనైన నిన్ను నే
మఱవ మఱేడకుం జనుట♦మాని సుఖంబున దక్షవాటికన్
మఱిఁగలిగొన్న సమ్మదము♦తో గమనింపుము భీమనాయకుం
డఱలేని వేల్పు నిఖి♦లాభ్యుదయంబులు నీకునయ్యెడున్.

వ. అనిన సాంబవచనంబులు విని విశ్వేశ్వరదేవ రచితన్య
క్కారమహోపద్రవసంభూత వేదనాదూయమాన మాన
సుండనయ్యును భవానీకృపాపాంగపీయూషవిక్షేప దాక్షిణ్యం
బున నొక్కింత యంకిలి దెలిసి శిష్యసహితుండనై
యెన్నఁడెన్నఁడు భీమేశ్వరుం దర్శింతునో యని యువ్వి
ళ్ళూరి యేతెంచుచున్నవాఁడఁ బరమమాహేశ్వరుండ
వైన నిన్నుం గనుంగొంటి నింక నామనోరథం బవ్యాహత
గతిం బ్రవర్తింపఁగలయది. 72

తే. అనవధానత నావగిం♦జంతసూవె
పర్వతంబంత యపరాధ♦భరముకొలిపి
కాశి వెడలంగ మొత్తినఁ♦గాసిఁ బొంది
తిరుగుచున్నాఁడ నిదె యేను♦దిక్కుమాలి. 73

తే. కడుదయాళురు దేవతా♦గణములెల్లఁ
గాలభైరవు చిత్తంబు♦కఠినపాక
మీరసము పెద్ద డుంఠి వి♦ఘ్నేశ్వరునకుఁ
గాశి మనబోంట్లకెల్లను♦గానిబ్రతుకు. 74

---

# ఐరావత చరిత్రము.



[ఈగ్రంథమును చిరుమూరి గంగాధరుఁడను కవి రచించినట్లుల విమర్శకులు దెలిపియున్నారు. గ్రంథారంభమునందుగాని అంత్యమునఁగాని కవివృత్తాంతముఁ దెలియు నాధారములు లేవు. కవిత్వము సరళముగ మృదుమధురముగ నుండును. ఈగ్రంథమున గాంధారి తొందరపాటు, ఐశ్వర్య గర్వములకుఁ గుంతి విచారపడి అర్జునుని సహాయమున నైరావతమును దెప్పించుకొని వ్రతసమాప్తిఁ గావించిన కథాంశము మనోహరముగా వర్ణింపఁ బడినది. ఆంధ్ర భారతమున లేని యీవింతకథను కన్నడము నుండి యెవరో తెనిగించి యాలోపమును బూర్తిచేసి యుందురు. కౌరవులు మాతృదేవి యాజ్ఞఁ బాలింపఁ జాలక మృత్తికాగజమును నిర్మింపఁ బార్థుఁడు ఐరావతమును గొనివచ్చి శౌర్యధైర్యములు ప్రకటించిన కథాంశ మిందుఁ జదువఁ జవులూరుచున్నది. కవిత మృదుమధురపదభూయిష్టమై సరసతరముగా నున్నది. చిరకాలము నుండి యజ్ఞాతముగానున్న యీగ్రంథరాజము పఠనీయమగుట ఆంధ్రుల సుకృతము.]

క. శ్రీవరగుణ జనమేజయ
భూవరుఁ డాభారతంబుఁ బొలుపుగ వినుచోఁ

భావం బలరఁగ మఱియును
దా వైశంపాయనునకుఁ దగ నిట్లనియెన్. 1

వ. మునీంద్రా నావిన్నపంబు సేయు నీకథాప్రకారంబు సవిస్త
రంబుగా వినిపింపవలయు నని జనమేజయుండు వినయసం
భృతమానసుండై వైశంపాయనున కిట్లనియె. 2

చ. అనఘవరేణ్య! నాదుచెవులారఁగఁ గౌరవపాండవేయ వ
ర్తనములు సర్వముం బ్రకటితంబుగ మీకృపవింటి శైశవం
బునన ధనంజయుండు సురపుంగవుదంతి ధరిత్రికిం జలం
బునఁ గొని వచ్చి కుంతివ్రతముందగఁ జేసినభంగిఁ జెప్పవే.

వ. అనియడిగిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 4

క. విను జనమేజయ! ఘనుఁ డ
ర్జునుఁడు మహాద్భుతము గాఁగ సురకరి యిలకుం
ఘనభుజశక్తిం గొని వ
చ్చినతెఱఁ గెంతయును దెలియఁజెప్పెద నీకున్. 5

మ. ధృతరాష్ట్రుండు మహార్ణవావృతధరిత్రీమండలం బెల్ల ద
క్షతఁ బాలింపఁగ భీష్ముకారణమునం గౌరవ్యకౌంతేయు లు
ద్ధతమాన్యుండగు ద్రోణునొద్దవివిధాస్త్రప్రౌఢివిద్యాప్రవీ
ణతశోభిల్లుచు హస్తినాపురి నఖండప్రీతితో నుండఁగన్. 6

ఆ. కురువిభుండు భీష్మకుంభజబాహ్లీక
సోమదత్త విదుర సుబలముఖ్య

బంధుజనులు గొలువ గాంధారితోఁ గూడి
యున్న యవసరమున నొక్కనాఁడు. 7

శా. నీలాంభోధరవర్ణదేహమును సుస్నిగ్ధప్రభాదండమున్
బాలార్కప్రతిమానపింగళజటాభారంబు యజ్ఞోపవీ
తాలంకారతయున్ మృగాజినము నొప్పారంగఁగౌతూహల
శ్రీలాలిత్యత బాదరాయణుఁడు వచ్చెన్ శిష్యవర్గంబుతోన్.

వ. ఇట్లు విజయంబుచేసిన కృష్ణద్వైపాయనమునీంద్రునకు నన్నరేశ్వరుండు సభ్యజనంబులుఁ దాను ససంభ్రమంబుగా నెదుర్కొని దండప్రణామంబులు చేసి యుచితాసనంబున నునిచి కుశలం బడిగి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించిన నతండు ప్రీతుండై యారాజు కుశలం బడిగి యెల్లవారలఁ గూర్చుండ నియమించి యిష్టకథావినోదంబులఁ బ్రమోదంబున నున్నయవసరంబున గాంధారరాజనందన యమ్మహాత్మునకుఁ బునరభివందనం బాచరించి కరకమలంబులు మొగిడ్చి యిట్లనియె. 9

క. ఏమివ్రతంబులు నోచిన
భామలకును మేలు గల్గుఁ బరమమునీంద్రా!
కామితవస్తుప్రదమగు
నామహితవ్రతము నాకు నానతి యీవే. 10

సీ. అనుటయు నమ్మహాముని ప్రీతచిత్తుఁడై
గాంధారి కిట్లను గారవమున

సాధ్వీ! నీదగుపుణ్యచరితంబు జనులెల్లఁ
గొనియాడి నెగడిరి కులపవిత్ర!
యతిథి సత్కారంబు నన్నదానముఁ జేసి
ఘనులైన కొందఱకులఁ గన్నదాన
నైరావతము నోము నధికసంపత్కరం
బగు నీకుఁ బుత్రుల కర్థ్వమనిన

తే. నభ్రిదంతావళము నోము నట్టి తెలుఁగు
మనుజులకు నెట్లు సిద్ధించు మాననీయ
యేవిధంబున నదియుఁ జేయుంపవలయుఁ
దగ నెఱింగించునది సవిస్తరము గాఁగ. 11

వ. అని యడిగిన నమ్మునీశ్వరుండు సంతుష్టహృదయుండై
యిట్లనియె. 12

గీ. అమరకరిఁ దేర నెవ్వరి కలవి గాదు
కనక కలధౌతముల మంట ననలతప్త
మగుట యింద్రుని కర్పితం బతివ నీదుఁ
సుతులు తెచ్చిన మృత్తిక ప్రతిమఁ జేయు. 13

క. వివిధాలంకారంబుల
దివిజకరిం బూజ సేసి తెలివిం దగు భూ
దివిజులకు నధిక తృప్తిగ
నవిరళదానంబు లొసఁగు మతిమోదమునన్. 14

వ. అని యానతిచ్చి వేదవ్యాసమునీశ్వరుండు యథేచ్ఛంజనిన
గాంధారరాజనందన సుయోధనాదిసుతశతకంబురావించు

టయు వారు నతిమోదంబునం జనుదెంచి తల్లిచరణపద్మం
బుల కెఱంగి వినయవినమితోత్తమాంగులై యున్నయవ
సరంబున గాంధారరాజనందన సుయోధనున కిట్లనియె. 15

క. అనఘుఁడు సత్యవతీనం
దనుఁ డైరావతము నోము నానతి యిచ్చెన్
విను మీ రది తేఁగలరా
ఘనముగ మృత్తికను బ్రతిమగాఁ జేసెదరా. 16

ఉ. రెండవమాటకియ్యకొని దృప్తపరాక్రమజృంభణాఢ్యులై
యొండొరు మీఱఁగాఁ గడఁగ యుబ్బున దాఁటుచుఁ గేళ్ళు వాఁచుచున్
దండములై సుయోధనుఁడుఁ దమ్ములు మోచిరి మంటిముద్దలా
ఖండలదంతిఁ జేయుటకుఁ దా మొకపర్వతమంత వ్రేల్మిడిన్.

వ. ఇట్లు కొనివచ్చి యామృత్తిక శిల్పిజనంబుల రప్పించి యభ్ర
దంతావళప్రమాణంబు గావింప నియమింపవలయు ననిన
వారును గళాకుశలత్వంబు మెఱసి విచిత్రచిత్రితోదంతంబు
లును మండితోద్దండతుండంబులును రాకాసుధాకర ప్రభా
వంతంబులగు చతుర్దంతంబులును గా నైరావతంబు సాంగోపాం
గంబుగా రచియించి దానిపై పసిండిపక్కెర బువెట్టి నవరత్న
ఖచితంబగు కనక సూత్రావలంబంబులు దవిల్చి ఘంటికా
పంచకంబమర్చియు నానావిధభూషణజాలంబుల నలంకృ
తంబై యలంకారశోభితంబై ప్రతిమాకారంబున రజితా

చలంబు ననుకరించుచు సకలజనంబులకు నానందకరంబై శోభిల్లినం జూచి సుయోధనుం డంతిపురంబునకుం జని యైరావతాకారం బాయత్తం బయ్యె వ్రతంబు సేయ విజయంబు సేయు మనవుడు. 18

సీ. కడుసంతసంబున గాంధారి మంగళ
స్నాతయై మేలివస్త్రములు గట్టి
మృగమదఘనసారమిళితమౌ చందన
ఘనవిలేపనములు గనకరత్న
భూషణజాలంబు బుష్పదామకములు
ధరియించి పసిఁడియందలము నెక్కి
పుణ్యాంగనాజనంబులు వేడ్కఁ జనుదేర
నైరావతముకడ కరుగుదెంచి

తే. మహితమౌక్తికచ్ఛత్రచామరము లిడఁగ
నమితకళ్యాణవివిధవాద్యములు మ్రోయ
సంభ్రమంబునఁ గనుగొనుజనుల నెల్ల
దూరమున వేత్రహస్తులు దొలఁగఁజేయ. 19

గీ. ఇవ్విధంబున నేతెంచి యిందువదన
దవ్వుదవ్వునఁ బ్రీతి నందలము డిగ్గి
చేరి దండప్రణామంబు సేసి షోడ
శోపచారంబులను బూజసాంపమర్చి. 20

క. సురకరినో మిది రం డని
కరిపురమునఁ గలుగు పుణ్యకాంతలఁ బిలువన్

పరిచారకులం బంపెను
నరవర రప్పింప సుబలనందన ప్రీతిన్. 21

ఉ. చీరలు విచ్చుటాకులును జిత్రపుఁబూవులు పోఁగునూళ్ళుఁగ
ర్పూరసుగంధవస్తువులుఁ బోకలు నాకులు నానఁబాలు ఖ
ర్జూరకపిత్థమాదిఫలచూతఫలాదులు వెట్టి చేట లిం
పారఁగ వాయనంబు లిడి వారలకుం దగ నిచ్చె భక్తితోన్.

క. ధరణీసురులకుఁ దనియఁగ
గురునియనుజ్ఞను హిరణ్యగోదానంబుల్
పరితోషంబున నిడియును
బురజనులకు నిచ్చెఁ గల్పభూజముభంగిన్. 23

వ. అప్పుడు 24

క. చింతింపదు సిరిమదమునఁ
గుంతిం బిలువంగఁ జనదు కొడుకులుఁ దానున్
సంతసమున సుబలాత్మజ
యంతఃపురమునకుఁ జనియె సంచితలీలన్. 25

ఉ. అక్కడ గుంతియుం దను ననాదరణంబొనరించెఁ జూచితే
యక్కటయంచుఁ జిత్తమునఁ నంటినచిచ్చుడిపాటుతో నొడల్
మిక్కుటమైన నెంతయు శమింపఁగ నోపక మందిరంబులో
నొక్కెడమేను వైచుకొని యుండె నిరంతరఖిన్నమూర్తియై.

వ. ఇట్లున్న యవసరంబున నర్జునుండు 27

శా. ద్రోణాచార్యులశిక్ష దివ్యశరసందోహాది శస్త్రాదు ల
క్షీణప్రౌఢిమ నభ్యసించి పటుశక్తిస్ఫూర్తికిం శాత్రవ
క్షోణీపాలురు తల్లడిల్లఁగ జనస్తోమంబు లింపార గీ
ర్వాణాధీశసుతుండు వచ్చె భుజగర్వస్ఫారసంరంభుఁడై. 28

వ. ఇట్లు వచ్చి సదనంబున కరిగి నిజజనని యున్న చందంబుఁ
గనుంగొని మనంబున నిది యెట్టిదకో యని భయంబు
గదుర నెదుట నిలిచి. 29

సీ. ఇవ్విధంబున జేరి వివ్వచ్చుఁ డట్లున్న
తనతల్లి చరణపద్మముల కెఱఁగి
చిత్తంబు కడకతోఁ జిడుముడి పడుచుండ
జనని నీ విట్లున్న చందమేమి
యెవ్వరివలన నీ కీ మనస్తాప మి
ట్లెవ్వరు గావించి రెగ్గు నీకుఁ
బరుషభాషణములు వలికి రెవ్వరు నిన్ను
నెదురుఁ ద న్నెఱుఁగక మదము పేర్మి

తే. గలుగు నీచుల నెంతవారలను నైనఁ
గడక గర్వంబు లుడిగించి కష్టపఱతు
నేను గలుగంగ నీ కేటి కీయవస్థఁ
గంది యిటువంటి వగలను గుందనేల. 30

చ. అనుటయుఁ గుంతియిట్లనియె నాదటనాధృతరాష్ట్రదేవి నేఁ
డనిమిషదంతి నోమఁగ మహావిభవంబున నెల్లవారలం

గనుగొని పిల్వఁబంచి తనగర్వముపెంపునఁ దన్నుఁ జూడర
మ్మనుటకుఁ జాలకెంతయు ననాదరణంబొనరించె నర్జునా.

క. కొడుకులు నూర్వురు గలరని
కడు నైశ్వర్యమునఁ గన్నుగానక మనలం
దడవఁగ నొల్లదు కంటే
బహుగుతనం బసదు కాదె పరికింపంగన్. 32

క. బాలురు మీరలు పాండు నృ
పాలుఁడు దివి కరిగె పీరిపంచలఁ బడి యీ
లీల నభాగ్యపుఁ గూటికిఁ
బాల్తెతిమి యిదియు నొక్క బ్రదుకె కుమారా. 33

ఆ. అనుచు వెచ్చనూర్పు యధికశోకంబున
బాష్పపూరనయనఁ బాలఁజూచి
యిట్టు లనియెఁ గ్రీడి నెట్టన ప్రవిజృంభ
మాణమానచిత్తమాన్యుఁ డగుచు. 34

క. తనసుతుల నూర్వురం గూ
డను మంటను గజము సేయుటకు జాలి రటం
చు నధిక గర్వమున సుబల
తనయ నినుం బిలువకున్నఁ దగ నేమి యగున్. 35

వ. అది యెట్లంటేని నాప్రతాపాతిశయంబు వినుము. 36

శా. అంభోజప్రభవాచ్యుతేశులు మదీయస్ఫారదోర్గర్వ సం
రంభప్రక్రియఁ జూచి మెచ్చ రిపుదుర్వారుండనై నేర్పునన్

రంభాది త్రిదశాంగనా సురభిమందారాది జాతంబుతో
జంభారాతిగజంబుఁ దెత్తు భవదైశ్వర్యం బవార్యంబుగన్.

సీ. దశకంధరుఁడు తొల్లి తమతల్లికై శివ
వ్రతము సెల్లింపంగ మతిఁ దలంచి
యవలీలఁ గైలాస మదలించి యెత్తిన
నతనిసత్వమునకు హరుఁడు మెచ్చి
తనపురంబునఁ గల్గు ఘనవస్తుకోటు లా
తని కిచ్చి దయతోడఁ దద్వ్రతంబు
సేయించె ననుట ప్రసిద్ధంబుగా విందు
నవ్విధంబున నేను నమరపురము

తే. నందుఁ గలసంపదలతోడ నమరగజము
నిలకుఁ గొనివచ్చి వేడ్క నే నిచ్చువాఁడ
నీయడుగులాన లేకున్న నేఁడుమొదలు
శస్త్రసన్న్యాస మొగి నేను సల్పువాఁడ. 38

క. అని వీరావేశంబున
ధను వప్పుడ యెక్కు వెట్టి తద్జ్యానాదం
బున దిక్కు లద్రువ సింహ
ధ్వనిఁ జేసి ధనంజయుం డుదగ్రస్ఫూర్తిన్. 39

మ. హరిపేరం దగ లేఖ వ్రాసి పటుదివ్యాస్త్రంబునం గట్టి స
ద్గురువుం భక్తిఁ దలంచి యగ్రజునకుం గుంతీమహాదేవికిన్

వరుసన్ ద్రొక్కిఁడి వారియాజ్ఞ నమరావాసంబుపై పూని స
త్వరితోత్సాహత నేసెనింద్రునిసభాస్తంభంబులక్ష్యంబుగాన్.
మ. పగిలెందిక్కులుభూతధాత్రి వడఁకెం బాతాళలోకంబు బె
ట్టుగఘూర్ణిల్లెఁబయోధులెల్లఁగలగెన్ డుల్లెన్ మహోల్కాతతుల్
నొగిలెన్ బన్నగరాజకూర్మములవెన్నుల్ దిక్కులున్ ద్రొగ్గెఁబా
దగిలెన్ గోత్రధరాధరంబులుభయంబందెన్ సురజ్యేష్ఠుఁడున్.

వ. ఇట్లతిభయంకరాకారంబున నద్దివ్యశిలీముఖంబు శతముఖు నాస్థానసభామండపాభ్యంతర స్తంభంబు బెట్టిదంబుగాఁ గొ ట్టిన నట్టిదట్టంపుమ్రోత బహుళనిఘూర్ణితపాతంబు చందం బు నొందిన నందుఁ గొలువున్న సురకిన్నరగరుడగంధర్వ యక్షరాక్షస సిద్ధవిద్యాధరాదులు భయభ్రాంతికలితచిత్తు లై నివ్వెఱగంది యున్న సహస్రనేత్రుండును భయకంపిత గాత్రుండై యుక్కుదక్కి యొక్కింత తడవునకుం దెలిసి నలుదిక్కులు పరికించిచూచి తమసమీప స్తంభలగ్నంబైన శరంబును శరాగ్రంబున నున్న తత్పత్రికయుఁ గనుంగొని యాశ్చర్యమగ్నమానసుండై యందఱ డెందంబులు డిందు వడంజేసి యాదరంబునం దగుమాట లాడి యాలేఖ తను మంత్రిచేతి కిప్పించిన గంభీరస్వనంబున నాతండిట్లనిచదివె

శా. స్వస్తి శ్రీమ దమర్త్యలోకపతికిం జంభాసురారాతికిం
ధ్వస్తారిప్రకరుండు క్రీడి శరవిద్యాశాలి పుత్తెరఁగాఁ

ప్రస్తావం బగు లేఖ కుంతివ్రతముం బ్రఖ్యాతిఁ బొందింప నీ
హాస్తిశ్రేష్ఠము మాకు నీవలయు నద్యత్ప్రీతిసంధిల్లఁగన్.

సీ. ఐరావతముతోడ నాపారిజాతమ్ము
గామధేనువును జింతామణియును
రంభాదులగు నప్సరస్స్త్రీలు మఱియును
నమరావతీపట్టణమునఁ గలుగు
దివ్యవస్తువులును దేవగణంబులు
హస్తినాపురమున కనుపవలయు
వైభవం బొప్పార వ్రతము సేయించిన
మఱునాఁడె పుత్తెంతు మరల వాని

తే. నీకు సుతుఁడను నన్ను మన్నించువేడ్క
సేయు మది సేయవేనియు వేయు నేల
యెవ్వ రడ్డంబు వచ్చిన నీక్షణంబ
యెల్లభంగులఁ గొనితెత్తు నింత నిజము. 44

ఆ. అనియు లేఖఁ జదువ విని సురాధీశుఁడు
కటము లద్రువఁ గ్రోధకంపితాధ
రోష్ఠుఁ డగుచు భీషణోక్తుల నిట్లని
పలికె నెల్లవారు బ్రమసి నిలువ. 45

క. చూచితిరే నరుగర్వము
గోచరమ్మె యెంత కెత్తుగొనియెం దనకుం
దోఁచినవి పనులు సేయఁగ
నీచక్కటి నున్నవాఁడ నే నింద్రుఁడనే. 46

క. ఏ నెక్కడ తా నెక్కడ
యే నెక్కుడునట్టి పట్టపేనుఁగు నడుగన్
దా నెంతవాఁడు; తెమ్మని
మానవుఁ డటె పనిచె దురభిమానము పేర్మిన్. 47

ఆ. బిరుదుమాట లాడి ప్రియములు పచరించి
సుతుఁడ ననుట యెంత చులకఁదనము
చంక దుడ్డు వెట్టి శరణార్థి యగునని
పరార యర్జునుండ యాగడీఁడు. 48

ఉ. పుట్టరె తొల్లి భూపతులు భూరిపరాక్రము లెందఱేనియుం
నిట్టలమైన మానవు లనేకులు పుట్టరె యెందు వారిలో
నిట్టి యమానుష ప్రబను లెవ్వరు సేసిరి యిందుఁ జెప్పఁగాఁ
జిట్టలు నేఁడు వీఁడిటులు సేయ జగద్విపరీత మారయన్.

మ. త్రిదశావాసులకుం బరాభవము సంధిల్లంగ వేళయ్యెఁబో
యిది గాదేని తలంచి చూండ మనుజుం డిబ్బంగులన్ దివ్యసం
పద తెల్లంగ దనయున్న తాపునకుఁ గప్పంబిచ్చి పుత్త్రమ్మనన్
మది లెక్కింపక యిట్టి యోసెఁ బటు బాణప్రౌఢి హుంకారుఁడై.

వ. అని పల్కి క్రోధరసాయత్తచిత్తుండై యాక్షణంబ పురు
హూతుండు జీమూతవ్రాతంబు రావించి మీర లరిగి
గర్వాంధస్వాంతుం డైన కౌంతేయమధ్యమునకు నివాసం
బైన వారణపురం బనివారణంబుగాఁ జుట్టిముట్టి కల్పాంత
సమయోద్రేకంబుగాఁ జేర్చి యేకవింశతి వాసరంబులు

బహుళనిర్ఘాతపాతాభీలంబుగ నప్పురంబు వప్రాట్టాలక
సౌధభవనహర్మ్యగోపురద్వారతోరణసహితంబుగాఁ బొడ
వడంచి ముంచి సమస్తజీవులం గాలించిరం; డతండు సేయు
తెఱంగు చూచుకొంద మనుటయుఁ దత్సభామధ్యంబున
సత్వాసత్వవిదుండైన నారదుండుదరహసితవదనారవిందుం
డగుచు నాఖండలున కిట్లనియె. 51

ఉ. ఏమి సురేంద్ర! యర్జునుని నెవ్వనిఁగాఁ గఁదలంచి యంబుద
స్తోమము నంపఁ జూచెదవు ప్రుక్కఁడుదాన నుదగ్రుఁ డుద్భ
టోద్దామబలాఢ్యుఁ డద్భుతవిధస్ఫురితోజ్జ్వల దివ్యబాణవి
ద్యామహనీయుఁ డన్నరుఁ డహంకృతవైరిసుశిక్షకుండిలన్.

మ. విను మాకంబము నాటినట్టిశర మావిల్కానిదివ్యాజ్ఞగా
ననఘా! యెవ్వఁడుఁ దాఁకఁగా వెఱచు నీయాలంబుఁ జాలిం
చువా;రనిబీరంబులుచాలు నేమిటికి ధారాపాతముల్ చాలు
నే, వినిపింపంగనతండు వేఁడినవియీా వేయింద్ర వేవేగమున్.

మ. నరనారాయణులాదిమూర్తులుజగన్మాన్యప్రభావోన్నతుల్
ధరణీభారము మాన్పఁబూని మనుజత్వంబందినా రిప్పుడా
నరుఁడీయర్జునుఁడిట్టులయ్యి రువురున్ సంగ్రామరంగంబులోఁ
బరిమార్పంగలరింతమీఁదబహుళప్రత్యర్థిపృథ్వీశులన్. 54

క. క్రూరమహీపాలకవర
వీరులఁ బలువుర వధించి విజయశ్రీ లిం

పారఁగ నీ కెంతయు నుప
కారము సేయఁగల రింద్రు కనుమిట మీఁదన్. 55

ఉ. కావున నెన్నిచందములఁ గైకొను మాప్రకటోక్తి పాండుధా
త్రీవరపుత్త్రునార్తి దగఁ దీఱుట మేలగు నాకుఁ జూడఁగా
నావుడు నట్లు కాక యని నారదుపంపునఁ బార్థుపేర నా
దేవవిభుండు లేఖ యిడి తీవ్రమె పంపఁ బ్రచండనామునిన్.

చ. పనిచిన ఖేచరుండరిగి పాండవమధ్యముఁ గాంచి యింద్రుపం
పునఁ దనవచ్చినట్టివిధముం బ్రకటంబుగఁ జెప్పి లేఖ యి
చ్చిన నతఁ డగ్రజానుజవిశిష్టజనంబులుఁ దాను నుండి ర
వ్నని కరణంబుఁ బిల్చి ప్రియమారఁగఁ బత్రికఁ జేతి కిచ్చినన్.

లయ. శ్రీమ దఖిలేశుఁ డజరామరగణాధిపుఁడు
భీమరిపుదైత్యమదసామజవిభేదో
ద్దామజలజాక్షుచటులామితపరాక్రముఁడు
శ్రీమహితుఁ డింద్రుఁ డభిరామము దలిర్పన్
సోమకులవార్ధిహిమధాముఁ డగు పార్థునకు
నేమమునఁ బత్రిక మహామహిమతోడన్
వ్యోమమున నుండి దగ భూమికిఁ బదంపడియ
సీమది దలంచినవి నోమునకు నిత్తున్. 58

చ. అనిచదువంగ లేఖ విని యర్జునుఁడయ్యమరేంద్రుదూతతో
ననియె మహేంద్రుపంపువినయంబునఁ గైకొనువాఁడ నేనున

వ్వనజభవాచ్యుతప్రమథవల్లభు లెంతయు నిచ్చమెచ్చఁగా
ఘనతరతీవ్రబాణమునఁగట్టెఁదు మన్నునుమిన్నుముట్టఁగన్.

వ. ఇట్లొనర్చిన దివ్యసోపానంబుల వెంట నైరావత పారిజాత చింతామణిసురభిప్రముఖదివ్యవస్తునిచయంబులును నప్సరోనితంబినీకదంబంబులును ననిచి పుత్తెంచుటయు మదీయవాంఛితంబు సేయున ట్లగుఁ గానినాటికి మీఁద నెట్లగు తానెఱింగెడుఁగా కేమి నీవు పోయి రమ్మనినఁ బ్రచండుం డరిగి యాఖండలుఁ గాంచి తాఁబోయివచ్చిన తెఱంగును నయ్యుధిష్ఠిరానుజుం డాడినగర్వవాక్యంబులును దేటపడ విన్ననతండు నారాయణసఖుండు నమానుషచరిత్రుం డగుటం జేసి మాననీయుం డగు నని పురందరుండు పరమానందంబునుఁ బొంది యంగీకరించి తదనంతరంబ 60

క. ఆవిధ మంతయుఁ దెలియఁగ
దేవనదీసూనునకును ధృతరాష్ట్రునకుం
భూవర! ధర్మజుఁ డెఱుఁగిం
గా వినిపింపఁగఁ దదాజ్ఞఁ గైకొని యెలమిన్. 61

క. నానాదేశంబులఁ గల
భూనాథుల నెల్ల దంతిపురి కరుదేరం
గా నియమింపఁగఁ జారులఁ
బూనికమైఁ బనిచె ధర్మపుత్రుం డెలమిన్. 62

వ. అట్లు పనుచుటయు 63

మ. అమితస్యందనవారణాశ్వభటసైన్యానీకముల్ గొల్వ భూ
రమణుల్ వచ్చిరి హస్తినాపురికి విభ్రాజిల్లఁ దత్సైన్యభా
రమునం బెల్లుగఁజేసి దిగ్గజాహికిటికూర్మశ్రేణి యూటాడన
య్యమపుత్త్రానిలజార్జునుల్ వెలుచ నిత్యానందముంబొం
[దఁగన్. 64

క. కెందామరపుష్పంబులు
నెం దుండునో కుంతి నోఁచ నేగతి వచ్చున్
బొందుగ నాపుష్పంబుల
కందువ మున్నెఱుఁగ భువిని గలరో లేరో? 65

వ. అనుచు నయ్యర్జునుండు పెద్దయుం బ్రొద్దు విచారించి లంకా
నగరంబునం గలవని నిశ్చయించి. 66

ఉ. (శ్రీ)మహనీయదైత్యకులశేఖరుఁడైన విభీషణుండ! సం
గ్రామయశోవిలాసుఁ డరిరాజభయంకరమూర్తియైన సు
త్రామసుతుండు క్రీడి విదితంబుగఁ బంపిన లేఖ; మాకుఁ గెం
దామరపుష్పముల్ వలయు దానవనాయక పంపుపెంపునన్

గీ. అనుచు నది యొక్క శరమున నంటఁగట్టి
యేపు దీపింప గాండీవ మెక్కుపెట్టి
బాణ మరివోసి లంకపైఁ బాఱ నేసె
జలధి యంతయుఁ గడుభీతిఁ గలఁగఁబడఁగ. 68

క. ఊర్జితులు రాక్షసేంద్రులు
నిర్జివితు లగుచు భీతి నెరయంబడఁగా

నర్జునుఁ జేసినబాణము
గర్జిల్లుచు లంక మేడకంబము గట్టెన్. 60

వ. తదనంతరం బావిభీషణుండును మేడకంబమునాటినశరంబుఁ జూచి యత్యాశ్చర్యహృదయుండై యాయున్నపత్రికఁ దనకరణంబుచేతఁ జదివించి సంతోషించుకొని కొలువు గలయం గనుంగొని 70

ఉ. ఆమనుజారి చూడ నతివిస్మయమౌ నిదియిట్టిసాహసం
బీమహి యేలువారలకు నేయుగమందును లేదు వీఁడు శ్రీ
రామసమానుఁడౌ ననుచు రాక్షసవీరులదిక్కుఁ జూఁచి కెం
దామర లర్థిఁ దేఁబనిచె దానవనాథుఁడు తత్క్షణంబునన్.

ఉ. ఏలినవాని పంపుగొని యేడ్తెఱదైత్యులుపోయి పుష్పముల్
చాలినయన్ని గోసికొని సాగరమంతయుదాఁటి లావునన్
వాలినయట్టి దానవులు వాసవనందను మందిరంబులోఁ
దాలిమితోడఁ జొచ్చి నరుఁ దక్కఁగ నేరి కదృశ్యదేహులై.

క. కెందామర లాయర్జును
మందిరమున నునిచి మగుడ మనుజాశను లా
నందమున లంక కరిగిరి
పొందుగ గాండీవిమహిమ పొగడుచు నసురుల్. 73

ఉ. శ్రీమహనీయుఁ డర్జునుఁడు చెచ్చెరఁదెచ్చిన వానిఁ గుంతి
కెందామరపుష్పరాశిఁ గని తద్దయు నచ్చెరువంబుతోడుతన్

గామమదాపహారుఁ గటకంఠుని౯ బూజ లొనర్పఁగంటి నా
నోముఫలించె నంచుమదినూల్కొను వేడుక సంతసిల్లఁగ౯.

ఆ. సవ్యసాచి యపుడు జననినోమునకుఁగా
దివిజ లభినుతింప దివికి భువికి
నంప తెరువు గట్టి నైరావతముఁ దెచ్చు
టద్భుతంబు చూత మని తలంచి. 75

వ. ఇట వచ్చినరాజలోకంబు నెల్లనుం ధర్మనందనుం డయ్యై
విధంబుల సంభావించి తగునివాసంబుల విడియించి మజ్జన
భోజనాది కృత్యంబుల నియోగించి మౌహూర్తికాను
మతంబున నొక్క శుభదినం బంగీకరించి పురం బలంక
రింపఁ బంచిన 76

సీ. కమ్మగొజ్జఁగినీటఁ గస్తూరి మేదించి
యలికిరి వేదికాతలము లెల్ల
ఘనసార శకల ముక్తాఫలప్రితతుల
వెలయంగ ముగ్గులు వెట్టి రెలమి
భాసురకనకరంభాస్తంభములు పూన్చి
రమరంగ మణితోరణములు గట్టి
చిత్రపట్టాంశుక శ్రేణిఁ గట్టడములు
గట్టిరి విపణిమార్గముల నెల్లఁ
గమలకల్హార కేతకక్రముకసార
శోభితంబుగఁ గరిపురి చూడ నొప్పెఁ

బ్రజల కెల్లను గన్నులపండువగుచు
బహుళసంపద సురపురపాటి యగుచు. 77

వ. ఇవ్విధంబునఁ బురం బభినవశృంగారం బయ్యె నప్పు డష్ట
నుండు, 78

క. లాలిత గంధాక్షత పు
ష్పాలంకారముల వలన ననిశంబు జయ
శ్రీలకు నెలవైన ధను
శ్శాలకు నేతెంచె నధికసంరంభమునన్. 79

శా. సంతోషంబునఁ జూచురాజులకు నాశ్చర్యంబు దీపింప ని
శ్చింతాత్ముం డయి యగ్రజన్మజననీశిష్టాగ్రజన్మాళి క
త్యంతప్రీతి నమస్కరించి మది బ్రహ్మాస్త్రజ్ఞ భూతేశులన్
గుంతీసూనుఁడు నిల్పి ప్రుచ్చుకొనియెం గోదండముద్దాముఁడై.

వ. ఇవ్విధంబున 81

మ. విలులీలంగొనియెక్కువెట్టిఘనమౌర్వీరావముల్ దిక్కటం
బులు భేదింపఁగ నస్త్రసంతతి నభోభూభాగమధ్యంబునన్
లలి సోపానపథంబు గట్టె ఘనలీలం జూచు భూపాల పం
క్తుల కత్యద్భుతహర్షలీలవొడమన్ దుర్దాంతదోర్దర్పుఁడై.

క. మొదలొకటి యొకటి పదియై
పదినూఱయి నూఱు వేయి పదిలక్షలునై
పదికోటు లర్బుదములై
తుది నగణితమై కిరీటితూపులు నెగడెన్. 83

క. కరిపురిబహిరంగణమును
సురపురివప్రంబుఁ దాఁక సోపానచయం
బరుదుగ నరుఁ డొనరించెం
గర శరకుశలత్వములు వొగడ్తకు నెక్కన్. 84

చ. జనవర! సవ్యసాచి శితసాయకహేతినితాంతవేగసం
జనితమహోసకారమునఁ జవ్వనఁ గూలె గులాద్రులబ్బులె
ల్లనుబరిఘూర్ణమానవికలత్వమువొంది బెదరమోదమాలికల్
మునిసె దిశాతటంబుల నదుల్ వెనుదాటి క్రిక్కఁగలంగె లో
కముల్. 85

ఆ. సురలు బెగ్గడిల్ల సురవిభుఁ డాశ్చర్య
జలధిఁ దేలి సవ్యసాచిబలము
చూచి యాత్మ మెచ్చి సురలతో నున్న ది
క్పాలవరులతోడఁ బలికె నెలమి. 86

చ. మును కపిసేనతోడుగ సముద్రముఁ గొండలచేత సేతుబం
ధన మొనరించు టెంతరఘునాధుఁడు నేఁడు కిరీటి తూపులె
ల్లను గొనిమూడ బట్టబయలం బలుచిత్రముగాఁగ శరబం
ధన మొనరించి మిన్నునకుఁ దాపలుపెట్టె జగత్ప్రసిద్ధిగన్.

ఉ. కావునఁ బార్థువాంఛితము గ్రక్కున నించుట యుత్తమంబ యై
రావతదంతి నిచ్చుటికి రాఁబనుపం దగువారిఁ బంచె న
ద్దేవవిభుండు వారుఁ జని దిగ్గజరాజు నలంకరింప నా
నావిధవస్త్రపుష్పరచనాగరిమం బొనరించి రిమ్ములన్. 88

వ. మఱియు బహురత్నఖచితస్ఫురితాభిరామంబైన హాటక
ల్యాణంబును గండస్థలోద్భూతదానధారామోదలుబ్ధభ్రమన్మధుకరఝంకారపరివర్తమానలలితకనకఘంటికాసహస్రంబును శరజ్జీమూతకలధౌతచంద్రచంద్రికాప్రకాశంబైన చమరవాలజాలంబును ననవరతాభినవపరిమళవికచాయమానసప్తచ్ఛదప్రసూనదామంబును వివిధప్రకారంబుల శోభితంబుఁ జేసి యభ్రదంతావళం బాఖండలు నాస్థానమంటపంబునకుఁ దెచ్చుటయు నతండు నయనాబ్జసహస్రంబు నెలమిం బొంద నమరపురకాంతాజనంబులును దుంబురు నారదాదులును

గీ. కామధేనుచింతామణికల్పకములు
గరుడ గంధర్వ యక్షకిన్నరగణంబు
సిద్ధవిద్యాధరామర శ్రేణి నెల్ల
నమరకరితోడఁ గరిపురి కమరఁ బనిచె. 90

చ. పనిచిన నాక్షణంబ సురపాలకునాజ్ఞ వహించి వేడ్క నె
క్కొనశతకోటిసంఖ్యసురకోటులు గొల్వఁగ నభ్రదంతి య
త్యనుపమలీల వచ్చె విజయాస్త్రనిబద్ధవిశుద్ధమార్గమం
దనఘుమహాద్భుతంబెసఁగ హస్తిపురంబునకశ్రమంబునన్.

ఉ. అంత నజాతశత్రుఁడు నిజానుజవర్గము బంధులోకమున్
శాంతనవాంబికేయకలశప్రభవాదులుఁ దాను నెంతయున్

సంతస మంది ఫాలమున సంగతిఁ జేర్చిరి మోడ్పుచేతు ల
ల్లంతలఁ జూచుచున్ సురగణావళికిం బులకాంకురాంగులై.

ఆ. అపుడు భూతలమున కవతీర్ణమై పుర
బాహ్యమున నిలిచె సుపర్వసమితి
విజయుఁ డరిగి యట్టివృత్తాంత మంతయు
విన్నవించెఁ దల్లి వెఱఁగు నొంద. 93

మ. విజయుంగాఁగిటఁజక్కఁ జేర్చి త్రిజగద్విఖ్యాతిగా నేఁడు పాం
డుజనాథేశ్వరభోజవంశములు రెండున్ బావనం బయ్యె నీ
భుజసత్త్వాతిశయంబుచే ననుచునుబ్బుం బ్రేమయుంగుంతికా
త్మజనింపన్ వ్రతమాచరించుటకు నుత్సాహంబు శోభిల్లఁగన్

క. బహువిధపుణ్యజలంబుల
విహితస్నానంబు సేసి వెలయు దుకూలో
ద్వహయగుచుఁ బుణ్యకాంతా
సహగతి గాంధారికడకుఁ జని వినయమునన్. 95

వ. అద్దేవిపాదంబులకుఁ బ్రణామంబు సేసి కరకమలంబులు
మొగిడ్చి కుంతి యిట్లనియె. 96

క. తెచ్చె సురేంద్రునికరి వి
వచ్చుం డిదె నేఁడు దివ్యవస్తుచయముతో
నచ్చుటికి నోము నోమఁగ
విచ్చేయుం డిపుడు మీరు వేగ బనినన్. 97

క. కొలుతఁ దననోచు నప్పుడు
తలఁపక యున్నట్టి బేలుఁదనమును మదిలోఁ
దలపోసి సుబలనందన
'చెలియల! నే రాను నీవ సేయుము వ్రతమున్.' 98

సీ. అనఁ గుంతి సుబలునితనయతోఁ బేదల
మని తలంచియు రాక యునికి తగునె
జనులు మృత్తికఁ జేసికొని నోమ నైరావ
తము దెచ్చు టది పేదతనమొ యనిన
నత్తేజమునకు నీ వర్హురాలవు గావె
నీపట్టిఁ బార్థు మన్నింపరాదె
యనిన నైనను నోమునప్పుడు ప్రియమున
నేను నిన్ బిలువమి నింత పుట్టె

తే. నట్లు గావున రాను బొమ్మ నఁగ నపుడు
పాండుభూపాలుసతి యొండు పల్కు లుడిఁగి
చనియె గంగాతనూజాతు సదనమునకు
వినయమును సంభ్రమంబును బెనగొనంగ. 99

వ. అట్లరిగి విదురసహితుండై యున్న శాంతనవు పాదంబులకుం బ్రణమిల్లి తాఁబోయి సుబలతనయతో నాడినమాటలును దదీయభాషణంబులును 100

చ. తెలియఁగ విన్నవించుటయు దేవనదీతనయుండు సాధ్వి! నీ
పిలుచుట లెస్స, యీవ్రతము ప్రీతి దలిర్పఁగఁ జేయుచుండియు

పొల్పలఁతియయుండనిమ్ము మణిభూషణముల్ కనకాదులెల్లవి
చ్చలవిడి నీవు గైకొనుము సమ్మతిసేయుము దానధర్మముల్.

వ. అనిపల్కి మందాకినీనందనుఁడు పరమానందంబునుం బొంది బాహ్లీక సోమదత్త ధృతరాష్ట్ర కృపాచార్యాది మిత్ర గురువర్గంబును దండనాథభటనికరంబులును నుత్సవాలోకి నోత్సుకులై వివిధదేశాధీశ్వరులతో నడువఁ గనకరత్న మయాందోళికారూఢయైయున్న కుంతీమహాదేవి మున్నిడుకొని భేరికాంస్యకాహళవేణువీణాది మంగళవాద్యంబులు మొఱయఁ గవిగాయకవందిమాగధ పాఠకస్తోత్రంబులు సెలంగ వేత్రహస్తు లెడనెడ సందడిఁ జెలంగ మందయానంబునం బురంబు నిర్గమించి బంధురసుపర్వగంధసింధురం బున్నయెడకుం జనుదెంచె నయ్యవసరంబున 102

చ. లలితసుగంధపుష్పసమలంకృతి నొప్పుచుఁ గుంకుమచ్ఛటా
కలితశరీరముల్ మెఱయఁగా మణిభూషణచారువస్త్రముల్
పొలుపు వహించి యచ్చటికిఁ బుణ్యసతీనివహంబు వచ్చెనిం
పులు దళుకొత్తఁ బాల్కడలిపుత్రివిలాసపుమూర్తులో యనన్.

సీ. మదనాంబకంబులు మగమీల బెళుకులుఁ
గలిగెడు సిసువాలు గన్నుఁగవయు
హిమకరబింబమ్ము హేమదర్పణములుఁ
దెగడంగఁ జాలిన నగుమొగములు
నిందిందిరంబులు నింద్రనీలంబులుఁ
గుఱుచ సేయఁగ నొప్పుకుంతలములు

... ... ... ... ... ...

తే. నసదుకాండీగలును సైకతసమకటులు
గలిగి చూడ మనోహరాకారు లగుచు
సరవిఁ బురవారకామినీసమితి సెలఁగెఁ
దరళకలకాంచినూపురధ్వనులు సెలఁగ. 104

ఆ. అందలంబు డిగ్గి యైరావతముఁ జేరి
యధికభక్తి నాత్మ నలరి కుంతి
దేవి గంధపుష్పదీపధూపాదుల
నర్చనంబు లిచ్చి యర్థిఁ బ్రమొక్కె. 105

మ. వరుసం గల్పకకామధేనువులు గీర్వాణప్రతానంబుఁ బెం
పరుదారంగ యథావిధానముల నభ్యర్చించి రంభాది ని
ర్జరకాంతావళితుంబురుప్రభృతులున్ సంతోషముంబొందనా
దరణంబొప్పఁగ గారవించెఁ ద్రిజగత్ప్రఖ్యాతపారీణతన్.

వ. తదనంతరంబ 107

సీ. అనతిదూరంబున నఖిలపావని యైన
భాగీరథికి నేఁగి పరమభక్తి
గౌరీసురూపంబు ఘనవాలుక సమర్చి
వివిధార్చనంబులు వెలయఁ జేసి
సాంగంబుగాఁగఁ బుణ్యాంగనావళి కెల్ల
హర్షంబుతోడ వాయనము లిచ్చి
యగ్రజన్మశ్రేణి నపరిమితంబుగా
ధాన్యభూధేనుసంతతులఁ దనిపి

యాదరంబునఁ బిలిచి దీనార్థిజనుల
చిత్తములు ప్రీతినొంద నీప్సితము లొసఁగి
మఱియు నేతెంచెఁ గుంతి యమందలీల
మానితంబైన దివిజసామజముకడకు. 108

ఉ. వచ్చి తగంగఁ బాండుజనవల్లభుదేవి ప్రదక్షిణంబుఁగా
వచ్చి నమస్కరించి సురవారణపుంగవు నెక్కవేడ్కఁ బెం
పచ్చుగఁ బ్రీతిమై గురుజనానుమతంబునఁ గూడి రాఁగ వి
వ్వచ్చుఁడు నన్నదమ్ములును వారనివేడ్కలనుల్లసిల్లఁగన్.

మ. వరుసం గల్పిత పారిజాతసుమనోవర్షంబు చిత్రంబుగాఁ
గురిసెం దోడనెదుందుభుల్ సెలఁగెనత్యుగ్రంబుగా నొక్కటన్
మొరసెం దివ్యవిలాసినీనటన లామోదంబు సంధిల్లఁగా,
నెరసెం దుంబురునారదాదివినుతుల నిండారి మిన్నందఁగన్.

వ. అయ్యవసరంబునం బురందరోపవంశంబున నతిరమణీయం
బగు పాండుబమాలికాలంకృతంబై బహుళనక్షత్రపరివృతం
బగు రాకాసుధాకరబింబంబు ననుకరించు ధవళచ్ఛత్రంబును
ననేక రమ్యరత్నస్థాపితంబులగు చామీకరదండమండి
తంబులై యాఖండలాఖండితలీలాభీలంబగు చమరవాలం
బులు ధరియించి బృందారకసుందరు లమందానందంబునం
గొలువ కుంతీమహాదేవి యుభయపార్శ్వంబులు బలసికొలువ
సిద్ధవిద్యాధరాదిఖేచరగణంబులును సకలభూసురనివహం
బులును నలుదిసలు బలసికొలువ భీష్మధృతరాష్ట్రాదిరాజలో
కంబును ధర్మజభీమార్జుననకులసహదేవులును నాత్మజనం

బులునుం బ్రమోదభరితు లై చను దేర విప్రాశీర్వాదంబులు
మేదురంబు లగుచు రోదసీకుహరపూరితంబు లై చెలంగ
ముందఱ వందివారక జనంబులు విజయాంకమాలికాపఠ
నం బొనరింప నత్యంతదర్శనసుందరం బగుచు మందయా
నంబునఁ బురంబుఁ జొత్తెంచు నెడ. 111

చ. పొలఁతులక ప్రయోజకపుఁబుత్రులునూఱ్వురు నేలచాలడే
బలవదరాతిభంజకుఁడు పార్థునిఁబోలుకుమారుఁడొక్కరుం
డలరఁగ వీరమాత యగునట్లుగ నేమితపంబు సేసెనో
యిలఁదొలి మేనఁగుంతిజగదేకమహోన్నతిఁబొందె నెంతయున్.

వ. అనుచు నయనానందకరంబుగాఁ గనుంగొనుచు నుండి రా
సమయంబున. 113

క. కరిపురిసురపురితరుణులు
వరలావణ్యముల నొక్కవరు సైయున్నన్
నరసురనికరం బెఱుకకు
సరియై భేదింప దనిమిషత్వముఁ గతనన్. 114

గీ. ఇవ్విధంబునఁ బురమున కేనక మెసఁగి
వచ్చి నిల్చిన మందిరద్వారభూమి
నిలిపి యైరావతము డిగ్గి నెలఁత లెలమిఁ
గొలువ నభ్యంతరమునకుఁ గుంతి యరిగె. 115

క. సకలనరపాలకాంతా
నికరంబుల నాదరమున నెయ్యంబున భో
జకసుత పౌర పురంధ్రీ
పరికరంబును బోషఁబనిచె బహుమానమునన్. 116

ఉ. అత్తఱి సవ్యసాచి దివిజావళిఁ జూచి ముదం బ్రియంబు ద
ళ్కొత్తఁగఁ గుంతినోము భువనోన్నతి సెందెఁ జనుండు మీరు స
ద్వృత్తమనస్కులార యతివేగము నంబురుహాతు పాలికిన్
మత్తకరీంద్రుఁ దోడ్కొని క్రమంబున నమ్ముల త్రోవ నిమ్ములన్.

చ. అని పలుకం బ్రమోదమున నయ్యమరావతికిం సురౌఘముల్
చని సురనాథుఁ గాంచినఁ బ్రసన్నత నొందె నతండు నంత న
ర్జునుఁ డొగి మున్ను కట్టిన యిషుప్రకరోన్నత మార్గ మెల్లఁ దు
త్తునియలు గాఁగ నేసె విబుధుల్ మది భీతి దొలంగి మెచ్చఁగన్.

వ. అని చెప్పిన వైశంపాయనుం డిట్లని తలంచె 119

సీ. విశ్వవిశ్వంభరా శాశ్వతోన్నతిజనుః
పాలనాంచిత ధనుఃపాణిచేతఁ
బ్రణతభూవరశిరోమణిగణవిస్ఫుర
త్ప్రథులశాశ్వతపాదపీఠుచేత
సురుచిరమృదువాక్యసురకామినీమనో
మోదితస్పృహణీయమూర్తిచేతఁ
జక్రివాళవిశాలశైలోన్నతస్థలీ
కేళీవిహార సత్కీర్తిచేతఁ

తే. గ్రిడిచేత గగన కీలితదివ్యాస్త్ర
[illegible]రచితాధ్వకీర్తి సరణిచేత
నిఖిలలోకములకు నేత్రిసుపర్వమై
యెంతయును జెలంగెఁ గుంతినోము.

---

జైమిని భారతములోని

# కుశలవోపాఖ్యానము.

[ఈవచనకావ్యము రచించిన కవి సముఖ వెంకటకృష్ణప నాయకుఁడు. ఈయన తండ్రియగు మీనాక్షినాయకుఁడు మధురరాజ్యమును క్రీ. శ 1623-1659 వఱకు పాలించిన తిరుమలనాయకునికడ మంత్రిగా నుండెనని ప్రవాదముకలదు. మీనాక్షినాయకుని కుమారుఁడగు ప్రకృతకవి క్రీ. శ 1660-1700 మధ్యకాలమునఁ బ్రసిద్ధుఁడై యుండును. జైమినిమహాముని వ్రాసిన సంస్కృతభారతమును జైమిని భారతమందురు. దానిని బదునేనవ శతాబ్దమునఁ బద్యకావ్యముగ పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి తెలిగించెను. సంస్కృత గ్రంథమును ఆంధ్రీకరణమును జతపరచి వేంకటకృష్ణప్పనాయకుఁ డీవచన కావ్యమును బ్రౌఢము రసవత్తరము నగు శైలిలో వ్రాసెను.

అరుదుగ లభించు ప్రాచీనవచనకావ్యములలో నిది యొక్కటి. ప్రకృతకథాంశము మూఁడునాలుగు ఆశ్వాసములనుండి యిందుఁ జేర్చితిమి. వచనశైలి ధారాళముగ నిర్ణీతముకాని కాలమున జనించిన దగుటచే నీకబ్బమున వాక్యములు పెద్దవిగ నున్నవి.]

జనమేజయుండు జైమినిం గనుంగొని సీతాకుమారు లైన కుశునితో శ్రీరామచంద్రుం డేమిటికి యుద్ధంబు సేసె ననిన మునీంద్రుండు నరేంద్రునింజూచి దురితహారంబును శుభకరంబును మనోరథప్రదంబును విఖ్యాతంబును నైన కుశలవోపాఖ్యానంబు వినిపించెద సావధానచిత్తుండవై వినుము. శ్రీరామభద్రుండు తండ్రిపంపునం బదునాలుగు సంవత్సరంబు లరణ్యంబునం దపంబుగావించి రావణకుంభకర్ణ మేఘనాద ప్రముఖ రాక్షసుల సమయించి, తనప్రవేశంబువలన నలునిం బావనంబుసేసిన జానకీదేవిం జేపట్టి, సౌమిత్రి విభీషణ సుగ్రీవ జాంబవత్ప్రముఖులైన యోధవీరులు గొలువ నయోధ్యా నగరంబునకు వచ్చి, పురజను లెదుర్కొనం బుష్పకంబుడిగ్గి వసిష్ఠమహాముని కభివాదంబొనర్చి తమ్ములకు మ్రొక్కి, తనకు వందనంబుసేసిన భరతశత్రుఘ్నులం గౌఁగిటంజేర్చి సుమంత్రుండు మొదలగు మంత్రుల సంతాపంబు దీఱ వారివారి నాదరించి పతివియోగదుఃఖితయు నిజవియోగక్లేశితయు నైన కౌసల్యకడకుం జని దండప్రణామం బొనర్చుటయుం దనయుని గౌఁగిటంజేర్చి గద్గదస్వరంబున "అన్నా! రాఘవా! మున్ను వసిష్ఠాదిమునులు నన్నుం జూచి 'నీకుమారుం డక్షయకుమారుం డాద్యుండు నప్రమేయుండు నచ్ఛేద్యుండు నభేద్యుండు నఖిలలోకాధీశ్వరుండు' నని పలుకరించిన దబ్బఱగా నెంచి యుండితి. ఇప్పుడు జలధిబంధనంబును దశముఖసంహారంబును జేసి బ్రహ్మరుద్రాది దేవతాపూజితుండవై యేతెంచుటకతనం

దద్వాక్యంబులు నిజంబులని తోఁచె'నని పలుకు నంబపలుకు లకు శ్రీరఘువీరుఁడు సంతసించుచుఁ బురందర వైభవంబున నయోధ్యకు వేంచేసి పట్టాభిషిక్తుండై రాజ్యపరిపాలనంబు సేయుచుండ, వృక్షంబులు సర్వకాలంబులందును గిసలయ కుసుమఫలభరితంబులయ్యె, ధేనువు లపారంబుగా క్షీరంబు లీయందొడంగె. తగినపతి దొరకుటవలన ధరణీతరుణి నిశ్చల త్వంబు నొందె. తస్కరభయంబులు సున్నయయ్యె. పుత్ర శోకంబులు లేవయ్యె. వైధవ్యంబులురావయ్యె. ప్రాణులురోగం బు లెఱుంగరైరి. నెల మూఁడువానలు గురియసాగె. ధాత్రీ తలంబు దున్నకయ పండె. ధారణపోఁకకుఁ బుట్టేఁడయ్యె. ఈతిబాధ లొక్కటి లేవయ్యె. ఇవ్విధంబున శ్రీరామచం ద్రుండు గుణత్రయంబు తోడంగూడిన పరతత్త్వంబు చందం బున ననుజత్రితయంబుతోఁగూడ జలధివలయవేల్లితంబైన జగతీతలంబు నేలుచు సీతాసమేతంబుగా నిష్టోపభోగంబు లనుభవించుచుఁ దొమ్మిదివేలసంవత్సరంబులు ధాత్రీపాల నంబు సేసి "యపుత్రులకు లోకంబు లేదుగదా" యని యూ హించి మనుజమాత్రుని చందంబునఁ బితౄణంబు దీఱు నుపాయంబు యోజనసేయుచుఁ బుత్రార్థియై సంతాపంబునఁ గుందుచుండ, జానకి శ్రవణానక్షత్రచతుర్థపాదంబునఁ జరమ లగ్నంబున జననిం బట్టణంబు వెడలింపం జాలు ముహూర్తం బునఁ బ్రథమఁ గర్భంబు దాల్చె

అంత నాలవమాసంబునఁ గడపటిదినంబు ప్రభాత కాలంబున లక్ష్మణుండు సీతాదేవిం గొనిపోయి యడవిలో విడచి వచ్చునట్లుగాఁ గలఁ గని దిగ్గన లేచి మనంబునం గలంగుచు సంధ్యాది విధులు నిర్వర్తించి గురుండైన వసిష్ఠమహా మునితో నిశాచతుర్థయామంబునం గన్నకల తెఱంగెఱిగించిన నమ్మునీంద్రుఁడు రఘూద్వహుం జూచి "భావికార్యంబుగాక మానదు. శీఘ్రంబుగా జనకపుత్రికిఁ బుంసవనాది కర్మంబు లాచరించి గర్భసంరక్షణంబు సేయందగుఁ దమ్మునిం బంపి సత్వరంబుగా జనకుని రప్పింపుము. ఐదవమాసంబునందు శుక్లపక్షసప్తమీ దినంబున నిరుపురకుం జంద్రతారా బలంబులు పొసంగి యున్నయవి. నాఁటికి ధనుర్లగ్నంబున సీమంత పుంసవనంబులు సేయందగినయవి" అని ముహూర్తనిర్ణయంబు సేసిన రఘువీరుండు జనకునిం దోడ్కొనివచ్చుటకు సౌమిత్రిం బనిచి వసిష్ఠ వామదేవాదు లునిచిన లగ్నంబునఁ బండ్రెండు గడియలమేర దూరంబు చౌకంబుగా నింద్రనీలమయంబులును వజ్రఖచితంబులును వైడూర్య నిర్మితంబులును దప్తకాంచన ఘటితంబులు నైన స్తంభంబులు నిలిపి పెండ్లిచవికె వేయించె.

తదనంతరంబ జనకమహీపతియు యుధాజిత్తు మొదలయిన బంధువులు వచ్చుటంజేసి సప్తమీదినంబున వసిష్ఠ మహాముని వామదేవాదులతోడం గూడ నాజ్యతిలచరు హోమంబులు గావించి సీతాదేవి కొప్పున ములుపంది ముం

ష్ఠుతోఁగూడ సూత్రవేష్టనంబు సేసి, గోదుమపూసల పేరు పత్తికాయపూసలపేరు నాగమోక్తవిధానంబున నాజగదంబ గళంబున నిలిపి, శంఖభేరీమృదంగ ఝల్లరీమురజ గంభీరధ్వనులు దిశామండలంబు నిండ బ్రాహ్మణులకుఁ గనకరత్నాంబరగజతురగాది దానంబులు గావించి, మహీసురులతోఁడం గూడ బాంధవులం బంతులు దీర్చి బంగరుపళ్ళెరంబులం బహువిధాన్నంబులు భుజియింపఁ జేసి భూసురాశీర్వాదంబులు గైకొని మహోత్సవంబు సేయుటయు జనకమహారాజు తన కోరిక నెఱవేఱుటవలన నానందభరితమానసుండై యమ్మహోత్సవంబు జూచి తనయేలు రాజ్యంబు నెల్ల నల్లునకొసంగి, విశ్వామిత్రునితోఁ గూడఁ దపోవనంబునకుం జనియెఁ గాకుత్స్థనందను సర్వసర్వంసహావలయంబు నేకాతపత్రంబుగా నేలుచున్న యెడ నొక్కనాఁ డేకాంతంబున జానకీకాంత కాంతునితో నిట్లనియె. "వల్లభా! నాయుల్లంబున నొక్క కాంక్ష యున్నది. నీవు నెఱవేర్పవలయు. గంగాతీరంబున దపంబు సేయు తపసియిల్లాండ్రతోఁడంగూడ వనంబుల విహరింపుచు నుండ గోరెద" అనిన రావణాంతకుండు గుండె జల్లన నీయొప్పులకుప్ప యింతయొప్పని కోరిక గోరునే? యని వగలం బొగులుచుఁ దొల్లి పదునాల్గుసంవత్సరంబు లడవులలో నిడుములు పడినదియునుం జాలక, యిప్పుడు నదియ కోరె.

నేను తొలుతఁగన్న దుస్స్వప్నం బను లతికి కిది ఫలం బయ్యెనని నిశ్చయించి "కొమ్మా! యటులకానిమ్ము రేపటికి నిన్ను వనంబులకుం బనిచెద" నని యభ్యంతరమందిరంబున కయ్యింతి ననిచి యున్నసమయంబునఁ బ్రతీహారి యరుగు దెంచి "పౌరవృత్తాంతంబులు దెలుపుటకుఁ జారులు వచ్చి యున్నవా" రనిన రఘువీరుండు వారలం బిలిపించిన నందఱు వందనంబులుసేసి కేలుమోడ్చి వరుసగా నిలుచుటయు, "నేఁటి కెవ్వియేనియు వింతలు గలవేని దెలుపుఁడు. నన్ను నాతోఁ బుత్రులు జనకనందన నుద్దేశించి జను లేమనియెదరు? వెఱ వక పలుకుం" డనినఁ జారులు భయకంపితులయి "దేవా! తారకమంత్రంబునకు నీ వర్థము. పంచమహాపాతకంబు లని యెడి చీకట్లకు దేవర నామాక్షరంబులు చండభానుకిరణం బులు. త్రిలోకపావనుండవైన నిన్నుందలంచినయంతఁ బాపం బులె పుణ్యంబులగు. అట్టిదేవరతోడ దుష్టచిత్తులైన వారల మాటలు పలుక నలికెదము. అయినను స్వామివార లానతిగు టంజేసి వినినమాట దాఁపక తెలిపెదము. 'ఈపురంబున నొక్కచాకిత, మగండు తిరస్కారంబు సేసె నని యలిగి పుట్టి నింటికిం బోయిన దానితండ్రి 'కూఁతురా! జనంబుల దేహం బులు సోఁకి మయిలపడినకోకలు శుద్ధి సేసి ధారణయోగ్యం బులు సేయునట్టి యుత్తమకులంబునకు మయిలఁ గల్పించితివి. పంక్తిజగకుం బింటిలోన నె యడంపక యింతదూరంబు వచ్చుట

తగవుకాదు!' అని కూతుం దోడ్కొని యల్లునికడకు వచ్చిన వాఁడు నెయ్యి వోసినయగ్నిచందంబున భగ్గున మండుచు "నిల్లు వెడలి నాలుగుదిశంబులు వేఱొకచోట నుండి మగుడ నాకడకు వచ్చినపడంతి నేలుటకు రక్కసుండు గొనిపోయిన సీతం దెచ్చికొనిన రాఘవుండను గాను" అని యన్నిచుండు దుర్భాషలు పలికినఁ జెవులు మూసికొని వానిమాట కొమరితం దోడుకొని యింటికిం బోయె. మలినాంబరములకు నిడఁగా మిగిలిన యెంగిలిగంజిఁ ద్రావుచుఁ బొట్టపోసికొనునీచునియందు నిట్టిదుర్గుణంబులె కాని మంచిమాట లేమిటికిం బొడము! ఐన నీవృత్తాంతంబు దేవర కెఱింగింప వచ్చితి" మనిన మనుకులతిలకుండు మనంబున జల్లన మేను మ్రాన్పడఁ గొంతతడవుండి ధైర్యం బవలంబించి చారులం బొమ్మని యారాత్రి నాలవజాము బ్రహ్మకల్పంబు గడపినకరణిం గడపె.

అనంతరంబ వేగుటయు భరతలక్ష్మణశత్రుఘ్నులు సత్వరంబుగా రామభూమీశ్వరుసమ్ముఖంబునకు వచ్చి చింతాక్రాంతుండును వివర్ణవదనుండును బాష్పాకులితనేత్రుండును నై రాహుగ్రస్తుం డైనపూర్ణచంద్రుండునుం బోలెఁ గాంతివిరహితుండై యున్న యన్న నవలోకించినమాత్రంబున ఖిన్నులై తత్పాదంబులకు మ్రొక్కి పలుక వెఱచి మెల్లమెల్లన "జగద్వల్లభా! దేవరపాదసేవయే సకలపురు

షార్థంబులకుం గారణంబు” అని యెంచు నట్టి మా యెడలం దయసూడకుండుటకుం గారణం బేమి యనిన రఘువరుండు చారులవాక్యంబులు పలుకరించి దుష్టపురుషునిచే నిందితం బగు వేదంబుకరణి క్షుద్రజనులచేఁ బరమసాధ్వి యగు సీత నిందం జెందె. అశనిపాతసంకాశంబైన లోకాపవాదంబునం గలుగు భయంబు డెందంబు నకర్షింపం దొడంగె. జన్మమరణభయభీతుండగు యోగిపురుషుండు మాయనుం బలె పరమసాధ్వియైన సీతను బరిత్యజించెద” ననిన విని భరతుండు భయకంపితస్వాంతుం డయి “అయ్యా! నీవంటి వివేకి యిట్టి నతీయం దగునె. కపిలధేనువును సంపాదించి యంటువడె ననుచు నడవిలో విడువ నడచువాఁడునుం గలఁడె. తొలుత లంకాపురంబున దశముఖుని సంహరించినపిమ్మట ననలంబులోనం జొచ్చి బ్రహ్మపురందర బృందారక బృందంబులు వినుతింపం గందకుండ నున్న యిన్నారీమణిం జూచి యీపతివ్రతాతిలకంబు తనవంగోడ లైనకతంబునం బుణ్యలోకంబులు గలిగెఁ, గావున్నం బుత్రశోకంబున మృతింబొందిన వారలకు గతి గలుగ నేర్చునె? యని దేవదానవ రాక్షస వానరవీరులు వినుచునుండ మనతండ్రి యగు దశరథమహారాజు కొనియాడినట్టి శుభచరిత్రయు నిక్ష్వాకుకుల పవిత్రయు సౌజన్యపాత్రయు నగు జనకపుత్రికను ఘోరమృగ పక్షిగణాకీర్ణంబును నిశాచరవిహార

స్థానం బైన కాననంబునఁ ద్యజించుటకంటెఁ బాపంబు లేదు. కావున నిట్లు చేయుట యనుచితం"బనిన, లక్ష్మణుండు రోషారుణలోచనుండై "లోకమాత యగు సీత నిట్లాడిన పరాధమునిం బరిమోఁడెంబులు సేయవలయుం గాని యీయంబుం బరిత్యజింపఁ దగునే" యనుటయు, శత్రుఘ్నుండును నట్లన పలికిన రాఘవుండు భరతాదులం జూచి "జానకి లోకపావని యగుట నే నెఱుంగుదు, నైన లోకాపవాదంబు పుట్టినయెడ నర్థంబు నైన ననుజుల నైన హితుల నైన దేహంబు నైనం దృణంబుగాఁ ద్యజింతుఁ గనిన యెడ నిది యేమి యెచ్చు. మనువంశ సంభవులును మానధనులు నైన హరిశ్చంద్రాదులు తొల్లి కీర్తికొఱకుఁగా సర్వస్వంబును బరిత్యజించిరి. వారల వర్తనం బిప్పుడుం గొనియాడం బడుచున్నయది. కీర్తిహీనుల జీవన్మృతులుగా నెఱుంగుడు. తొంటి రాజన్యులు తనువులైనం బరిత్యజించి కీర్తి సంపాదించిరి. అట్లగుటకతనఁ బావనచరిత్ర యైనసీత నుజ్జగించి కుప్పసం బూడ్చిన సర్పంబు తెఱంగునఁ బ్రకాశించెద" ననిన రఘువీరుని తెగువఁ గనుంగొని భయంబున మాఱాడ వెఱచి భరతశత్రుఘ్ను లప్పటికిం దలంకి చనిరి.

తదనంతరంబ దుఃఖంబునం జిక్కినయన్నయొద్ద లక్ష్మణుం డొక్కరుండ నిలిచె. అప్పుడు కాకుత్స్థుండు లక్ష్మణుని జేరంబిలిచి "సీతను గంగాతీరంబున నడవిలో విడిచి రమ్ము. కాదేని యీఖడ్గంబుచే నాశిరంబుఁ దెగ వ్రేయుము. జానకిం

గానలో విడిచిన పాతకంబు నాకుం గాని నీకుం బని లేదు" అనిన విని భుజగంబుకరణి నిట్టూర్పులు నిగిడించుచు గమనోన్ముఖుండై యన్నకు మ్రొక్కి యరదంబు నెక్కి యనేకంబులైన యపశకునంబులు గనుచు సీతాంగన యుండు నతిపురంబునకుం జనుదెంచి యయ్యంబపాదారవిందంబులకుం బ్రణమిల్లి "తల్లీ! నీవల్లభుండు నీకోర్కి చెల్లింపం దలంచె. విచ్చేయు" మనుటయు నాయమ్మ తానొక్కసారి వేఁడినఁ జన విచ్చి పంపె. పెనిమిటికిం దనమీఁద నెంత ప్రేమయో యని సంతసించుచు శ్రీరాముని పాదుకలు మున్నుగాఁ గైకొని రత్నభూషణంబులును రజతకనకంబులు నంబరంబులు సుగంధంబులు నానావిధంబులగు భక్ష్యంబులు హావణించి రథంబుమీఁద నునిచి యత్తలకు మ్రొక్కి కౌసల్యతో నిట్లనియె. 'నాదుకోరిక సమకూర్చుటకు సుమిత్రీసూనునిం గూడఁ బయనంబు సేసి గంగాతీరవాసినులయిన సువాసినులం జూచి రమ్మని మీకుమారుండు పనిచె" ననినఁ గోసలరాజతనూజ భూమిజంజూచి, "అమ్మా! కోమలాంగివి. ఘోరవనంబుల కేఁగి చనియెదవు? ఎండచే నెమ్మొగంబు గందు. తనులత వాఁడు. ఇదేమికోరిక మానుము"-అనుటయు "సమస్తభయనివారకుండైన శ్రీరఘువీరుండు నామనంబున నుండుటకతన వంత రవంతయును రాదు. మీకరుణ గలిగి యుండ నశుభంబు లేశంబును లేదు. మనసుకొదవలు మాని నన్నుం బంపు" మనుటయు నయ్యమ్మ యేమియు ననక

యూరకుండినఁ దక్కినవారల వీడ్కొని యవ్వేలంది యుత్త రీయంబుఁ జక్కఁ జెక్కి పచ్చనిగుఱ్ఱంబులు పూన్చిన రథంబు నెక్కి కదలుటయు సుమిత్రాసూనుండు గద్గదస్వరంబుతో సారథిం జూచి "యశ్వంబులు కన్నీరు నించి తలలు వంచు

—: లక్ష్మణుఁడు సీతాదేవిని వనంబునకుఁ గొనిపోవుట :—

చున్నయవి. ఇదియేమి యనుటయు "దేవా! నే నశ్వహృద యంబు చక్కఁగా నెఱుంగుదు. సమరంబులయందు నిరా ఘాటంబుగా సంచరించు నీఘోటకంబు లిట్లుండుటచే నెద్దియేని యు నొకదుర్దశ రాఁగలఁ దని తోఁచుచున్నయది. అయిన నా నేర్పుఁ జూడుమని గుఱ్ఱంబులఁ గందంబులు దట్టి ధేయని వాగె సడలించిన వాయువేగంబున నరదంబు పోవు నెడ వాయసం బును బాలభరద్వాజంబును గరుడుండును గగనంబునం గట్టె. కుందేలు నక్క మొదలగు మృగంబులు రథంబునకు నడ్డం బుగాఁ బఱవం దొడంగె. అయ్యమ్మకు దక్షిణనేత్రం బదరె. అప్పుడు సీతాదేవి రామానుజుం గనుంగొని "బెట్టుగా దుర్ని మిత్తంబులు దోఁచుచున్నయవి. చేవెట్టి కలంచినగతి నాయు ల్లంబు దురపిల్లుచున్నయది. కరుణాసముద్రుండును శౌర్య సముద్రుండునునగు శ్రీరామభద్రునకు శుభంబు గలుగుఁ గాక. ఏవీరుండు ఖరదూషణాది రాక్షసులం బదునాల్గువేల నొకముహూర్తంబున నుక్కడంచె; నేమేటి మెఱయించికొని పోవు మారీచమృగంబు మస్తకంబు ఖండించె? నే మహాను

భావుండు గొండలు పఱపించి సముద్రంబున సేతువు గట్టించె? నేజగ జెట్టి రావణ కుంభకర్ణాదుల వధియించి లోకత్రయంబున సౌఖ్యంబు సంపాదించె, నేదయానిధి విభీషణునకు శాశ్వతంబుగా లంకాసామ్రాజ్యం బొసంగె.

శరణాగతసంరక్షణవ్రతుండును రాజేంద్రుండును ననంతకల్యాణగుణసాంద్రుండు నైన యా శ్రీరామచంద్రుం డయోధ్యానగరంబు నేలుచు నాచంద్రతారకంబుగా సుఖంబున నుండుఁగాక" అని పలుకుచుఁ గొంతదవ్వు చని జానకీదేవి యుభయతీరంబులం బొడమిన తరులతానికరంబుల పుష్పవాసనలం బరిమిళితంబులును పూర్వసముద్రపరిచుంబితంబులును నై సప్తశతప్రవాహముఖంబులం గనుపట్టుచుఁ జక్రవాకపక్షమారుత సంచర ద్వీచీకలాప మైన దివ్యాపగం గనుంగొని వకుళతిలకసహకార నమేరుప్రియక మేదురం బైన తటంబున జనకతనూజయు సుమిత్రాసుతుండును రథంబు డిగ్గి కువలయమనోహరంబును సత్కవిసేవితంబును సుధాపరికాశంబు నై రాఘవునికీర్తిం బోలుచున్న గంగం గనుంగొని సంతసంబునం గొనియాడుచు నావికుండు దెచ్చిన యోడనెక్కి యవ్వలిగట్టునకుం బోయి స్నానంబులు సేసి ధౌతపరిధానంబులు ధరియించి పాదచారంబున జీమలకుందూఱఁగూడని కాఱడవి తెరువుబట్టి యకుంఠితంబు లైనకంఠీరవ కఠోర ఘోషంబులంఘూర్ణిల్లు మదగజంబులుజంబుకంబులువృకంబులువాలుమెకంబులు

మొదలగుమెకంబుల భయంకర ఘోషంబులును నడవి యీఁగల ఝుంకృతులును నిలకోళ్ళజీంకృతులును వనమహిషంబుల భాంకృతులునుం జెవులు వ్రక్కలుసేయ భీకరంబైన యక్కానసంబు నవలోకించి భూపుత్రి సుమిత్రాపుత్రునితో నిట్లను. "జీర్ణంబులు నీరసంబులు ఛాయావర్జితంబులు నైన వృక్షషండములచేఁ బ్రవేశింపంగూడని యరణ్యంబు గనుపట్టుచున్నయది గాని పావనంబులైన తపోవనంబులు గానరావు. వికటంబులుఁ దీక్ష్ణకంటకంబులు నైన బలుసు, తుమ్మ, చండ్ర, వెణుతురు, కోరింద మొదలగు పొదలు గనుపట్టుచున్నవి గాని పుణ్యపేటిక లయిన యతివరమఠవాటికలు గానరావు. కాఱుచిచ్చువలనం బెమ్బు పెరిఁగిన పొగ లెగయుచున్న యవి గాని హోమధూమంబులు గానరావు. సివంగులు చిఱుతపులులుం గనుపడుచున్నయవి గాని మునిబాలకులుగానరారు. పాషాణకర్కశంబులైన కాపథంబులు గనుపట్టుచున్నయవి గాని నడయాడు మార్గంబు గానరాదు. దశరథరాజనందను నెడఁబాయ నోర్చిన ననుబోఁటి పాపకర్మురాలికి మంచిది యేల కానవచ్చు" నని సంతాపంబు నొందు సీతాసతి నవలోకించి సౌమిత్రి మొగంబు వాంచి బాష్పపూరంబులు రాల్చుచుఁ "దల్లీ! లోకాపవాదనిమిత్తంబుగా నిన్నుఁ గాంతారంబు నొందించి రమ్మని రాఘవుండు కృపావిహీనుండ నగు నన్నుం బనిచె" నని యొడి తీవ్రభాషణంబు లశనిపాతంబు

రీతిఁ గర్ణరంధ్రంబులు సోఁకుటయు సురగాలిచేత వ్రాలిన కుసుమవల్లియుంబోలె మూర్ఛఁ జెంది పుడమిం బడి యొడలెఱుంగకయున్న జనకపుత్రింజూచి సౌమిత్రి పటాంచలంబున విసరి యుపచారంబులు సేయఁ దెలివినొందక యుండుటయుఁ "త్రికరణంబుగ శ్రీరామచంద్రుని చరణారవిందంబులయందు నిజభక్తి గలవాఁడ నేని జనకనందన బ్రతుకుంగాక" యని ప్రతినసేయుటయుఁ గన్నులు తెఱచి యా

— ♦ లక్ష్మణునియొద్ద సీత దుఃఖించుట ♦ —

యన్నులమిన్న యున్నవపక్షియుంబలె విలపించుచుఁ "నన్నా నీయన్నయు నీవును బదునాలుగేండ్లు నరణ్యంబునఁ గాపాడితిరి. ఇప్పుడిట్లు నట్టడవిలో దిగవిడువం దగునే? మఱందులలో నీవు నాయెడ భక్తివిశ్వాసంబులు గలవాఁడవు తొల్లి దండకావనంబున నేఁ దెమ్మనిన పువ్వులు దెచ్చియిచ్చి తనూభవుని కైవడిఁ గాపాడిన దయాపరుఁడవగు నీ విట్టి నిర్దయత్వంబున కొడిగట్టితివే? అపకీర్తికి వెఱవని సుగ్రీవునకు విభీషణునకు నిట్టి చెయిదంబులు సెల్లుంగాని నీకుం జెల్లునే? తండ్రీ! యేమనంగలదాన? నా పాపకర్మంబు నాకు వనవాసంబునం గోరికగాఁ బరిణమించెఁ, గాకున్న నెల్ల కార్యంబులు పరామర్శించి చేయు మీయన్న నిష్కారణంబుగా నన్నుఁ గాఱడవిలోన విడిచి రమ్మనునే? మున్ను నానిమిత్తంబుగాఁ గొండవిల్కాని కోదండంబు బెండువలె విఱిచివైచె.

నాకొఱకుఁగా మారీచమృగంబు మస్తకంబు ఖండించె. నన్నుఁ దెచ్చుటకై పాథోనిధిం గపులచే బంధింపించి సేనల దాఁటించె. నన్నుం జెందుటకై పదిమొగంబుల రక్కసుని శిరంబులు ఖండించె. అట్టి గుణాభిరాముండును దయారస ధాముండు నైన శ్రీరామచంద్రుండు కాకులు దూఱని కాఱు ఁడవిలో నన్ను విడచి రమ్మనియెనే! ఇది నానోముఫలంబు గాని నీ వేమి చేయుదువు? మీయన్న యానతి సేసితివి. మీప్రతినలు నెఱవేఱె. వేగంబు సాకేతనగరంబునకుఁ జొమ్ము." అని మఱియు జనకనందిని సుమిత్రానందనుం గనుంగొని "తమ్ముఁడా! వసిష్ఠవిశ్వామిత్రులు జనక దశరథులుం జూచుచునుండ నాఁడు వివాహసమయంబున జిప్పకూఁకటి యొప్పు మీఱుచు రత్నఖచితంబులైన కర్ణ భూషణంబులం బొలుపొందుచుఁ, దెలిదమ్మిరేకులం దెగడు కనుఁగవయు బింబాధరంబును మందహాసంబునం జెలు వొందఁ బూర్ణేందుసన్నిభంబైన రామదేవునిముఖాంబుజంబు ధ్యానంబు సేయుచు నుండంగలదాన; నన్నెడఁబాసిన విర హవేదన సైరింపం జాలక రాఘవ్రుం డేతీవియలం గౌఁగిలించు కొనియెనో యయ్యడవి తీఁగెలలో నన్నుం ద్రోసిరమ్మనె; నామరదృష్టంబు నేమందు? అత్తల కెల్లం గేలుమోడ్చితి ననుము. పూర్ణగర్భయు నిరపరాధయు నైన జానకిని నిష్కా రణంబుగా నట్టడవిలో విడిచి వచ్చితి ననుము. వత్సా!

నీకు మే లగుంగాక ! శ్రీరామభద్రునకు భద్రం బగుఁగాక ! భరత శత్రుఘ్నుల నడిగితి ననుము" అని పలవించు భూమినందనం గనుంగొని లక్ష్మణుండు "సాధ్వీశిరోమణీ! దైవయోగం బిట్టు లుండె. ఏల వగచెదవు? అల్లవే తాపసాశ్రమంబులు గనుపించుచున్నయవి. భాగీరథియు భూమిదేవియు వనదేవతలు నిన్ను రక్షించుచుందురుగాక ! నీయోర్పును నీపాతివ్రత్యంబును నిన్నుం గాపాడు" నని యూఱడం బలికి కన్నీరు ఱెప్పల నప్పళించుచుఁ బ్రదక్షిణంబు సేసి లక్ష్మణుం డలంఘనీయంబైన రాఘవుని శాసనంబునకుం దలంకుచుఁ దిరిగి తిరిగి చూచుచుఁ బసిబాలకుండు దోలుకొనిపోవ నంబారవంబు సేయుచు వత్సంబు విడువ నోపని ధేనువు తెఱంగునఁ బలవరించుచు జనకరాజనందిని చూచుచునుండ, హుటాహుటి రథంబుఁ దోలుకొని రామానుజుండు దవ్వుగా నరిగి యదృష్టిగోచరుం డగుచు నయోధ్యకుం జనియె. ధరణిపుత్రియు నరణ్యరోదనంబు సేయుచు మూర్ఛ నొంది పుడమిపై వ్రాలినం బక్షులు ఱెక్కలచే నీడఁ గల్పించుచు నంబరంబునం దిరిగె. చమరీమృగంబులు వాలంబుల నల్లనల్లన విసరె. సింహశరభ శార్దూలాదులు చుట్టునుం బరివేష్టించి కాపాడుచు నుండె. మదపుటేనుంగులు కరశీకరంబులచే జలధూమ్రంబులు నించె. భానుండు కిరణంబుల వేఁడిమి

చుటకు సంశయం బేటికి? ధరాతలంబునం గలుగు సకలరాజ లోకంబును, నేమును నీపనుపు సేయుచుండ నిప్పుడె యీ యధ్వరం బొనరింపు మని వారలంద ఱేకవాక్యంబుగఁ బలికి మఱియు వేర్వేరం బలుక నయ్యజాతశత్రుండు ధర్మయుక్తం బులును, హితంబులును, శుభప్రదంబులును, యోగ్యంబులును నగు వారల వచనంబు లాకర్ణించి యాగంబునకుం గృతనిశ్చ యుండై యుండె.

మఱియును భీమసేనాదులగు సహోదరులును, ప్రాజ్ఞ లగు మంత్రిజనంబులును, మహాత్ములగు ఋత్విజులును, కృష్ణ ద్వైపాయన ధౌమ్య ప్రభృతులును, బుద్ధిసంపన్నుండగు ధృష్ట ద్యుమ్నుండును, రాజధర్మవిదులగు విరాట్ద్రుపదులును, ప్రజ్ఞా వంతుండగు సాత్యకియును, సుభద్రానందనుండగు నభిమన్యుం డును,నుత్తమౌజుండును, యుధామన్యుండును, శౌర్యధురంధరు లగు ద్రౌపదేయులును, మొదలగు నిజాప్తజనంబులం గనుంగొని కౌరవ శ్రేష్ఠుండగు ధర్మనందనుండు "సకల సామ్రాజ్యాధిపతి యగు సార్వభౌముండు సేయ నర్హంబగు నీ రాజసూయం బొనర్ప నాదుమనంబు కోరుచున్నది. దీనికిఁ దగిన తెఱం గెఱింగింపుఁ"డనిన వారలందఱు నతనిం గనుంగొని, నీసామర్థ్య యోగంబును, దేశకాలంబులును, ధనాగమ వ్యయంబులును, పలుదెఱంగులం బరికింప నెల్లభంగుల రాజసూయాధ్వరంబుఁ గావింప నీవే యర్హుండవని మున్నే నిశ్చయించి యున్నవార

మని పలుక విని ధర్మనందనుండు తన మనంబున సకలలోకం బులకును దనకును, హితంబగు తెఱంగెయ్యది యని పలు మఱుం దలపోయుచు, సర్వలోకోత్తరుండును, నప్రమేయుం డును,బరమపురుషుండును, నాద్యంతరహితుండును, నజుండును ననం దగి లీలార్థంబుగా మహీతలంబున నవతరించిన శ్రీకృష్ణుం డీకార్యంబును నిర్వహింప సమర్థుండు. అతం డెఱుం గని కార్యంబును, నతండొనరింపని కృత్యంబును, నతనికి నసా ధ్యంబును, జతుర్దశ భువనంబులయందును లేదు, అట్లయగుటం జేసి మెల్లభంగుల నతని రావింపవలయు నని నిశ్చయించి యాజగదీశ్వరుని సమ్ముఖంబునకు, నింద్రసేనుం డనువానిం బనిచె. అతండును వాయువేగంబులగు తురంగంబులంబూన్చిన యరదం బెక్కి ద్వారకానగరంబునకుం జని సకలయాదవ పరివృతుండైయున్న వాసుదేవుంగనుంగొని దండప్రణామంబు లాచరించి వినయావనతుండగుచు నంజలింగావించి "మహాత్మా! వ్యాసధౌమ్యాది మహర్షి యుక్తుండును, సకల బంధుమిత్ర సహోదర సహితుండును నగుచు ధర్మనందనుండు నీదర్శనం బపేక్షించి యున్నవాఁ"డని విన్నవింప యదుకులాగ్ర గణ్యుం డగునాకృష్ణుండు వసుదేవబలరాములచే ననుజ్ఞాతుండై పాండు నందనులఁ గనుంగొనవలయు నను వేడ్క నెమ్మనంబునం దళు కొత్త నింద్రసేనసహితుం డగుచు నతిత్వరితగమనంబున నానా దేశంబులం గడచి యింద్రప్రస్థపురంబుఁ జేరి యనంతరంబ ధ

ందనుండు తన్ను సహోదర భావంబునం బూజింప, భీమ సేనుండు సౌహార్దంబు నెఱప, ధనంజయుండు సఖభావం బొన రింప, మాద్రినందనులు దనకు శిష్యకృత్యంబు వాటింప నిజ సహోదరి యగు సుభద్ర నెంతయుగౌరవించి యర్జునసహితుం డగుచు సుఖోపవిష్టుండై యుండ నాయదువల్లభునిం గనుం గొని యాయజాతశత్రుండు "ఉపేంద్రా! రాజసూయం బొన రింపవలయు నని తలంచితి. అది తలంచినంత నె లభించునది యునుం గాదు. ఆయజ్ఞంబు చేకూరునుపాయం బెయ్యది? దాని వివరింప నీవే సమర్థుండవు. సకలవస్తుసమృద్ధియును నఖండభూ మండలాధిపత్యంబును, నేసమయంబున నెవ్వరికిం గలిగియుండు నాసమయంబున నతండు గావింపఁదగిన యట్టి రాజసూయాధ్వ రంబు నీ వొనరింపుమనుచు బంధుజనంబులు నాతోడం బల్కెదరు. నీవును నట్లన నియమించితివేనిపదంపడి చేయనగు నని నిశ్చయించి యున్నవాఁడ. అది యెట్లంటేని లోకంబున స్నేహాతిశయంబునం గొందఱు, ధనాపేక్షవలనమఱికొందఱు, నింతయును విచారింపమింజేసి కార్యం బున్నరూపం బెఱిం గింపరు. కావున జనవాదం బిట్లు బహువిధంబులఁ బ్రవర్తిల్లు. నీవు సర్వజ్ఞుండవును, మాకు హితుండవు నగుటంజేసి యాచ రింపఁదగిన తెఱం గెఱింగింపు" మనిన.

కృష్ణుండు ధర్మనందనుం గనుంగొని, నిఖిలసద్గుణగణం బుల సామ్రాజ్యంబున కర్హుండవు. అట్లగుటంజేసి నీయెఱుంగని

కార్యంబునుం గలదే? అయినను విశదంబుగఁ దెల్పెద నాకర్ణింపుము. పూర్వకాలంబున జమదగ్ని నందనుండగు భార్గవ రాముండు సకలక్షత్రసంహారంబు గావించుటం జేసి భూలోకం బరాజకంబై యున్నతఱి దేవఋషిగణంబుల యనుగ్రహంబున నిప్పుడీ యున్న రాజవంశంబు గలుగుట నీవును వినియుండుదు. ఐలుండును, ఇక్ష్వాకుండును, గారణంబుగ నేకశతక్షత్రియ కులంబులు మహీతలంబునం బ్రసిద్ధిఁగాంచె. అందు యయాతి వంశంబు చతుర్విధంబునై నలుదిక్కులం బఱఁగె. సర్వక్షత్రియ జాలంబును, నీయయాతి కులసంభవు లగు మహీపతుల నాశ్రయించి ప్రవర్తించుచుందురు. ఇట్లుండ నన్యోన్యంబును మిత్రభేదంబుగావించి జరాసంధుండు చతుస్సముద్రపరివేష్టితం బగు మహీమండలం బంతయును నేకఛత్రంబుగఁ బరిపాలించుచున్నవాఁడు. ఈ యేకశతవంశసంభవులగుక్షత్రియులందఱును నతనిశాసనంబు శిరసావహించి మెలంగెదరు. మఱియును, బరాక్రమధురంధరుండగు శిశుపాలమహీపాలుం డతనికి సేనానాయకుండై యుండు. మాయాబలసమన్వితుండును, గరూశదేశాధీశ్వరుండును నగు దంతవక్త్రుం డతనికిఁ బరమభృత్యుండై యుండు. బాహాబలసంపన్నులగు హంసడింభకులను నామధేయంబులు గల యిరువురు రాజన్యు లతనిని గొలిచి యుండుదురు. మఱియు దంతవక్త్రుండును, గరభుండును, దివ్యరత్నంబు శిరంబునఁ గలుగుటం జేసి భూతమణి

యనఁ బ్రసిద్ధిఁగాంచిన మేఘవాహనుండును నాజరాసంధుని సేవింపుదురు. మురుండును, యవనుండును నను యవనదేశాధీశ్వరులు దన్ను నుపాశ్రయింపఁ బశ్చిమదిగ్భాగంబున వరుణదేవునిమాడ్కిఁ దేజరిల్లు; నతిలోకపరాక్రమధుర్యుండును, పాండుమహీపాలునకు సఖుండును నన బ్రసిద్ధుండగు భగదత్తుండును నతనికి విధేయుండై యుండు. అట్లుండియును నీయందు మిగుల ననురక్తుండగుటం జేసి నీవు నతనియెడఁ బితృభావంబు గావింపవలయు. మఱియు దక్షిణదిగ్భాగంబునఁ బశ్చిమదేశంబునం గల నృపాలు రందఱును, భయభ్రాంతు లగుచు నా మగధవల్లభుననుసరింపుదురు. కుంతీదేశాధీశ్వరుండును, శూరాగ్రేసరుండును, శత్రుభయంకరుండును నగు పురుజిత్తుండును, జరాసంధునిఁగలసి యున్నానాపై సమరంబునకువచ్చినతఱి నీకు మాతులుం డగుటం దలంచి నేనతని సమయింపనైతి. ఆపురుజిత్తుం డొక్కఁడుండ నీయం దెంతయు ననురక్తుండై యుండు. మఱియును, బుండ్రవంగ కిరాత చేది కైశిక దేశంబులంగల జనంబుల నిజభుజాబలంబున సంరక్షించుచు మహేంద్ర సమాన భోగంబు లనుభవించుచు లోకంబునఁ బురుషోత్తముండు నేన కాని వేఱొక్కరుండు కలండె యని నన్ను నెంతయు నవమానించి మదాంధుఁడై నాచిహ్నంబులగు, శంఖచక్రాదిసాధనంబులు దనచతుర్భుజంబుల ధరియించి పౌండ్రకవాసుదేవుండను నామంబున లోకంబునం బ్రవర్తిల్లుచుఁ బరాక్రమంబునఁబరశు

రామసమానుం డగు నాహ్వృతియును నిజసహోదరుండును దాను నా జరాసంధునకుఁ బరమమిత్రులై యుండుదురు. మఱి యును, రుక్మిణీజనకుం డగు భీష్మకుండు గులంబును, బలం బును, దనయాభిజాత్యంబును, గీర్తిప్రతాపంబులను, లేశ మాత్రంబేనియు మనంబునం దలంపక, వినీతుల భజియింపవల దని బహువిధంబులం బ్రార్థించు మమ్మును మా ప్రభుత్వంబును జీరికింగొనక యవమానించుచు నా మగధేశ్వరునకు వశవర్తి యై మెలంగెడు. మేమును జరాసంధభయంబునంజేసి పదునెని మిది కులంబులవారలతోఁగూడ నుత్తరదేశంబు వర్జించి యీ పశ్చిమదిగ్భాగంబునం జేరి యున్నారము. అదియునుంగాక శూరసేన, భద్రక, సాల్వ, పటచ్చర, సుస్థల, శకట, దాశ, కుళింద, కుంతి దేశాధీశ్వరులు నిప్పుడీ దక్షిణదేశంబున నున్న పాంచాలురును, పూర్వదిగ్భాగంబుననున్న మాళవులును, బశ్చిమదేశంబున వసియించు మాత్స్యులును మొదలుగాఁ గల మహీపతులు జరాసంధునివలని భయంబున నుత్తర దిగ్భాగంబుఁ బరిత్యజించి మెలంగెదరు. మఱియు గిరివ్రజ పురాధ్యక్షుండగు మగధుండు విజయయాత్ర వెడలకమున్నె పాంచాలురు భయభ్రాంతులై చెదరి నలుదిక్కులం జేరిరి. ఉగ్రసేనతనూభవుండగు కంసుండు నస్తియు బ్రాప్తియునను నామధేయంబులు గల జరాసంధుని కన్యకల వరించుటంజేసి గర్వోద్దీపితుం డగుచు సకలమహీపా.xర నవమానింప వార

లందఱును, నన్నుఁ బ్రార్థించుకతన నాహుకుని పుత్రుని నకూ్రరున కొసంగి నేను బలరామ సహితుండ నగుచుఁ గంసుని, నతనిసహోదరుం డగు సునామునిం బరిమార్చి బంధుహితంబుఁ గావించితి. అంతఁ గంసుని నిధనం బెఱింగి జరాసంధుండు సకలసేనాసమేతముగఁ గదలి మధురానగ రంబును జుట్టుముట్టి యతి ఘోరంబగు సంగ్రామం బొనర్చ నేమును యాదవభోజాంధక ప్రముఖుల బలంబులం గూర్చు కొని యనేక శస్త్రాస్త్రంబుల నానావిధాయుధంబుల సమరం బతిఘోరంబుగ సంవత్సరత్రయంబు గావించి యతని సేనా సముదయంబు నిరవశేషంబుఁ గావించితిమి. జరాసంధునకు హంసడింభకు లను మహీపతులు పరమమిత్రులై ప్రవర్తిల్లె దరని మున్నె యెఱింగించి యుండుదుఁగదా! అమ్మువ్వురు నొక్క ముఖంబున నడచిరేని భువనత్రయంబు నిమిష మాత్రంబున హరింపఁజాలుదు రని లోకంబునం గల మహీ పతు లాడుకొనుమాత్రంబె కాదు. నాహృదయంబున నట్ల తోఁచుచున్నయది. ఇతనితోఁ బదునెనిమిది వరుసల నతి ఘోరంబగు సంగ్రామం బొనర్చియుండియును శౌర్యాటోప సమన్వితుం డగు మగధేశ్వరుండు నిహతుండు గాఁడయ్యె. అతి ఘోరంబగు సమరంబున హంసుం డను నొక్క మహీ పాలుండు తెగిన, నదియ కారణంబుగ హంసుండు తెగటారె నని డింభకుని కెఱింగింపఁ దనకు బరమ మిత్రుండగు

హంసుండు లేని యీలోకంబున నెట్లు నిలువరించనేర్తు నని యతండు యమునాప్రవాహంబున నురికి మృతుండయ్యె. పదంపడి యీవృత్తాంతం బంతయు హంసుం డెఱింగి తానును నా నదీజలంబుల మునింగి హతుం డయ్యె. అంతయు విశదంబుగఁ దెలిసి జరాసంధుండు శూరసేనదేశంబులఁ బరిత్యజించి గిరివ్రజనగరంబునకుం జనియె. అంత నేమును మథురానగరప్రవేశంబుఁ గావించి సంతుష్టాంతరంగుల మగుచు సుఖంబునం బ్రవర్తిల్లితిమి. కంసభార్య లగు నా జరాసంధ కన్యకలు పతివియోగదుఃఖిత లగుచు మాతోడి సమరంబు నకు నమ్మగధేశ్వరు నిప్పుడుం బురికొల్పెదరు. అంత నేమును నాజరాసంధునియెడఁ గావించిన మహాపకారంబు మనంబునం దలంచి యొండొరు నెఱుంగకుండ నలుదిక్కులం బరచి వైభవంబు ప్రకాశంబుగానీక యడంకువలై మెలంగుచు బశ్చిమదిగ్భాగంబునఁ దొలుత రైవతుండను మహీపాలుండు నెలకొని యుండినఁ గుశస్థలీనగరంబు శూన్యంబైయుండుటం జేసి మేమందఱము నందు వసియించి యున్నారము. అమ్మహా దుర్గంబు దేవదానవులకు నసాధ్యంబై యుండు. అయ్యెడ వసియించియున్న యబలాజనంబున కేనియును సమరం బొనర్ప సామర్థ్యంబు గల దనునెడ నింక యాదవవీరులం జెప్పనేల? ఇట్లసాధ్యంబగు ద్వారకానగరంబుసమీపంబునంగల రైవతక పర్వతంబును మాధవతీర్థంబునుం బ్రాపుగాఁ జేరి వసియించుట కతన నిర్భయంబుగ సుఖించెదము. ఇటుల జరాసంధునితో

మహావిరోధంబు ప్రాప్తంబయ్యెఁగావున బలవంతులును బాంధవులును నగుమిమ్మునుమాశ్రయించెదము. మఱియు నాద్వారకానగరంబు మూఁడుయోజనంబుల పరపును నాలుగుయోజనంబుల నిడివియును నతివిచిత్రపురద్వారంబును నష్టాదశక్షితియకులసమన్వితంబును నై తనరారుచుండు. ఆనగరంబున నష్టాదశ సహస్రసంఖ్యం జెలంగెడు నాసహోదరవర్గంబును, మహేంద్రసమానులై శతసంఖ్యం దనరు నాహుకపుత్రులును జారుదేష్ణుండును, నతనిసహోదరుండగువక్రదేవుండును, సాత్యకియును, నేనును, బలరాముండును, సాంబుండును, బలపరాక్రమ సమన్వితులమయియుండుదుము. మఱియునుం దెలిపెద. కృతవర్మయు ననాదృష్టియు, సమీకుండును, సమితింజయుండును, గంహుండును, శంఖుండును, నిరాదుండును, ప్రద్యుమ్నుండును, ననిరుద్ధుండును, భానుండును, నక్రూరుండును, సారణుండును, శరుండును, గదుండును, నను నీపదునలుగురు మహారథులును, వితంద్రుండును, ఝులియును, బభ్రువును, నుద్ధవుండును, విదూరథుండును, వసుదేవుండును, నుగ్రసేనుండును, ననుసప్తమంత్రిజనంబులును, ప్రతిదినంబును బహుసువర్ణంబు గురియుచుండు శమంతకరత్నంబెవ్వరికింగల దట్టిప్రసేనుండును, నతనికుమారదశకంబును, మహారథికులును, భుజవీర్యధురంధరులును, నగునట్టి వృష్టివీరుల మందఱమును మాపూర్వనివాసంబగు మధ్యదేశంబు సంస్మరించుచుఁ బాండునందనులగు మిమ్ము దొరలుగానెంచి యాశ్రయించి యున్నవారము.

అని కృష్ణుండు మఱియు ధర్మనందను నుద్దేశించి యిట్లు జరాసంధుండు బలసంపదలం బెంపువహించి సుఖంబున నుండ నీకు సామ్రాజ్యం బెవ్విధంబునం జేకూర నేర్చు? మఱియు దుర్యోధనుండును, భీష్ముండును, ద్రోణుండును, నశ్వత్థామయు, కృపుండును, కర్ణుండును, శిశుపాలుండును, రుక్మియును, నేక లవ్యుండును, ద్రుముండును, శ్వేతుండును, శల్యుండును, శకు నియు నను నీయతిరథశ్రేష్ఠుల సమరంబున నిర్జింపక రాజసూ యం బెట్లు గావించెదవు? అయినను వీరలందఱు నీయందలి గౌర వంబు పాటించి మైత్రి సేయుదురుగాని సమరంబునకుం జేరరు. అర్జునియును, భుజాబలోన్మత్తుండును, దివ్యాస్త్రకోవిదుండును వైకర్తనుండును నగు కర్ణుం డొక్కరుం డెప్పుడును మీతో మత్సరించియుండుటం జేసి యతండు సంగ్రామంబు సేయక మా నఁడు. ఇది యిట్లుండె. అట్లు శౌర్యధుర్యుండగు జరాసంధుండు ప్రాణంబులతో నుండ నీకు రాజసూయం బెట్లు లభించు? సింహంబు కరికలభంబులం గొనిపోయి గిరిగుహామధ్యంబున నిడికొన్న కైవడి సకలరాజన్యలోకంబును బట్టి బంధించి యతండు కారా గృహంబున నిడియె. అదేమిటికంటేను, నా జరాసంధుండు మూర్ధాభిషిక్తు లగు నష్టసహస్రరాజన్యులఁ బశువులుగ నొనర్చి యజనంబు గావింపవలయునని తలంచినవాఁ డగుటం జేసి మహాదేవు నుద్దేశించి తపం బొనరించి యతనిప్రసాదంబువలన సమరముఖంబున మూర్ధాభిషిక్తు లగు నరపతులం జయించి

తెచ్చి గిరివ్రజంబునఁ గావించియున్నవాఁడు. నేమును నతని వలన వాటిల్లుభయంబున మధురానగరంబు విడిచి పుత్రమిత్రసహితంబుగ ద్వారకానగరంబునం గదా యిపుడు నెల కొనియున్నవారము. మాకు నిట్టిబలవద్విరోధంబునకుఁ గంస సంహారంబె మూలకారణం బయ్యె. అది యట్లుండె. నీకు నియ్యాగం బొనర్చుట యభిమతంబేని యెల్లభంగుల నతని సమరంబున నోర్చి కారాగృహంబుననున్న నరపాలుర విడి పింపుము. నీకు నివ్విధంబునఁ బలుమఱు దెలుపనేటికి? ఎన్ని విధంబుల జరాసంధుని వధియించుటయ యియ్యాగంబునకుఁ బ్రథమారంభంబు. కావున దీనికిం దగిన యుపాయంబుఁ జింతింపుము. అతనిం జయించుటయె సకలరాజలోకంబునుం జయించుటగా నెఱుంగుము. నాకుఁ దోఁచినదంతయు నెఱింగించితి. ఇంక నీచిత్తంబున నెయ్యది నిశ్చయించితివి? అది నాకు వివరింపు మనిన,

వాసుదేవునిఁ గనుంగొని ధర్మనందనుండు తెలుపందగిన దంతయు నీవ తెల్లంబుగ నెఱింగించితివి. ఇంత యెఱుంగ సామర్థ్యం బింకనెవ్వరికిఁ గలదు ? ఇట్లు సకల సంశయంబులు తీర్చి రక్షింప మాకు నీకంటెఁ బ్రాణబంధుం డెవ్వఁడు? అతి ప్రయాసంబున సాధింపందగిన సామ్రాజ్యపదంబు గృహంబున సుఖంబున వసియించి యపేక్షించువానికి నెవ్విధంబున సమకూరు? బుద్ధి బల సమన్వితుండగు మహాత్ముని సహాయంబు

లేక నేర్పరి యగువాఁడు కార్యం బారంభించునె? నానా రత్న పరిపూర్ణంబును నతి విశాలంబును నగుమహీతలంబంత యు నేకఛత్రింబుగఁబరిపాలింపక రాజసూయం బాచరింప సామర్థ్యం బెవ్విధంబునం గలుగు? పూర్వంబున ననేక యా గంబులు గావించి మాంధాతృ మహీపాలుండును, నిఖిలధరా చక్రింబుఁ బరిపాలించి భగీరథుండును, మహనీయ తపోమహా త్త్వంబునఁ గార్తవీర్యుండును, నిజభుజాబలమహిమంబున భర తుండును, మహత్తరంబగు నైశ్వర్యంబున మరుత్తుండును, సామ్రాజ్యాభిషిక్తులై ప్రవర్తిల్లిరని విందుము. అట్టిమహనీయ మహిమాభిరాములగు తొలుతటి మహీపతులకైనను బహు ప్రయత్నసాధ్యం బగుననిన నిప్పుడు మన మీ యాగంబుఁ గోరుటకంటె నీచింతఁదక్కి యూరకుండుట మేలని తోచు చున్నయది." అను నెడ భీమసేనుండు వాసుదేవునిం గనుంగొని "యుత్తమంబగు నీయాగం బారంభించిన నెఱవేరుటకు సంది యంబు లేదని నామనంబునం దోచుచున్నయది. న్యాయధురం ధరుండవగు నీవును జయశీలుండగు పార్థుండును భుజాబలసంప న్నుండ నగు నేనునుం గూడిన నగ్నిత్రయంబు మాడ్కిం దేజ రిల్లుదుము. మేము నీకటాక్షంబునం జేసి యామగధాధమునిం జయించెదము. అంత ధర్మనందనుని యభీష్టంబును నెరవేరెడు. జగదీశ్వరుండవగు నీవు మాకధీశ్వరుండవై యుండ జయలాభం బులు చేకూరుటకు సంశయంబునుం గలదే?'' అనియె.

---

శ్రీరస్తు.

శ్రీ సీతారామ పరబ్రహ్మణే నమః.

# భారతసావిత్రి.



[భారతములోని యుద్యోగపర్వమునందలి కథాంశముం గైకొని సంగ్రహరూపముగ వ్రాయఁబడిన వచనకావ్యము. దీని నెవరు రచించిరో కవి యెంత ప్రాచీనుఁడో తెలియరాదు. శైలి మృదుమధురముగ నించుక కఠినముగనుండి తిక్కన భారతభాగమునకుఁ దేట తెనుఁగు వచనముగ నున్నది. పరంపరగా నాంధ్రులీ గ్రంథము నొకరికొకరు చెప్పుకొనుటయుఁ గంఠస్థము గావించుకొని ప్రాతఃకాలమునఁ బఠించుటయుఁ గలదు. కృష్ణదేవరాయలు ప్రాతఃకాలమున భారతసావిత్రిఁ బఠించువాఁడని రాయవాచకము నందుఁగలదు. ఇది యేమైనచో నీగ్రంథము పదునేనవ శతాబ్దమునకంటెఁ బూర్వపుదని తలంప నగును. రసవంతరమగు నీయుత్తమగ్రంథములఁ బఠనీయముగ నున్నకతన సంస్కరించి యిందుఁ జేర్చఁబడినది.]

క. శ్రీరామా సీతా హృ
త్సారసరవిభానువంశ సాగరచంద్రా
భూరిదయారససాంద్రా
సారసపత్రాక్ష రామచంద్ర నరేంద్రా.

నించుతరిఁ గొడుకులుం గూతుం(డునుం గలిసి సందడిగా నిండి యుండవలయు, నట్టివరంబు దయసేయవలయు" ననిన నద్దేవుం డట్లుగాక యని వరంబొసంగె. అంత శ్రీకృష్ణదేవుని రాక యెఱింగి రాజరాజగు దుర్యోధనుండు విదురుని సదనంబునకు వచ్చి మధుసూదను నవలోకించి "కమలాక్షా! భీష్మద్రోణుల నుల్లంఘించి మాయింటికిరాక శూద్రునియింట భుజియించుట యర్హంబె"యనిన విని రుక్మిణీవల్లభుండు సుయోధనుంజూచి యిట్లనియె: "పరమ భాగవతోత్తముని యన్నంబును గంగా తోయంబును శ్రీవిష్ణుదేవుని పాదపద్మధ్యానంబును నేకాదశీ వ్రతంబును బరిశుద్ధంబులని పెద్దలవలన నెఱుంగవే? విష్ణుభక్తి పరాయణుం డయిన మనుజుండు నాలవజాతిని జన్మించిన వాఁడయినను శూద్రుండుగాఁడు. పరమభాగవతోత్తముం డయిన బ్రాహ్మణుం డనంబరగు. సకలజాతులయందును విష్ణు భక్తి లేని వాఁడు శూద్రుఁ డనంబరగు. నాయెడ భక్తిగలిగిన చండాలునయిన నవమానించుట బుద్ధిమంతుల కుచితంబు గాదు. అది యెఱుంగక నాభక్తుల దూషించిన నరాధములు రౌరవాది నరకంబులఁ జెందుచుందురు.

రాజేంద్రా! యాదరంబె యుడుగవలయుఁగాని భోజనం బడుగఁబని యేమి? యన్నంబు జాములోన జీర్ణంబగు. ఆదరంబు శాశ్వతంబయ్యి యుండు. భగవానియింట భుజియించుటయును భగవానికి భోజనంబిడుటయును నర్హంబుగాదు. నీవు మాకుఁ

బగవాఁడవగుటంజేసి నీయింట భుజింపరాదు. అది యెట్లంటేని పాండవులు మాకుఁబరమాప్తులగుటంజేసి వారియెడఁ జేసిన యపరాధంబు మాయందు నిత్యంబయ్యె. మాకుఁబాండవులు ప్రాణప్రిదంబగుట యెఱుఁగవే! ప్రియపూర్వకముగాఁ బిలిచిన వారియింట భుజించుట యుచితంబు. అన్నంబు లేకున్న నాపత్కాలంబునం దెవరియింటనైన భోజనంబు సేయందగును. మీకు మాయెడ ప్రేమంబు లేదు. మేము అన్నంబు లేనివారము గాము. సుయోధనా! యాదరంబుమీఁద నొసంగిన శాకమాత్రంబేనియు మామనంబున అమృతోపమానంబై యుండును. భక్తిలేక యిచ్చిన అమృతంబేనియు నిస్సారంబుగా నెన్నుదుము. నా పలుకులు వినఁగలవాఁడవైతేని దురభిమానంబు విడిచి పాండునందనులకు సమభాగంబుగా భూమింబంచి యిచ్చి మీరు నూరుగురును వారయిదుగురును గలిసి సుఖంబున నుండవలయు, కులంబునకు హాని దేవలదు. మీరు నూటయేవురు నేకీభవించియుండుట కార్యంబదిగాక కాననాంతరంబునం బన్రెండేండ్లు వనవాసంబును నొక్కయేడజ్ఞాతవాసంబును జేసివచ్చిన ధర్మనందనాదు లేవురైదూళ్ళడుగుచున్నవారు. అవియేవంటేని ఇంద్రప్రస్థంబును, అవంతియు, యమప్రస్థపురంబును, వారణావతంబును నివి నాలుగు గ్రామములు మఱియు హస్తినాపురంబునుం గోరుచున్నవారు. కావున నవశ్యంబుగా నియ్యందగినవి" అనిన విని దుర్యోధనుండు శ్రీకృష్ణదేవునింజూచి యిట్లనియె. "కేశవా! కయ్యంబు సేయక కాని

యేను వాడిగల సూదిమొన మోపినంత మాత్రంబేనియు భూమిబంచి యీయఁగలవాఁడను గాను." అనుటయు శ్రీకృష్ణదేవుండు దుర్యోధనుంజూచి యిట్లనియె.

"ధృతరాష్ట్రనందనా! కపిధ్వజంబును గాండీవంబును మెఱయఁ బాండవమధ్యముండైన యర్జునుండును, నుద్దండ గదాదండంబు మెఱయ గిరగిరం ద్రిప్పుచు వేదండంబునుం బోలె వృకోదరుండును రణంబునకు వచ్చి పిలిచినప్పుడు సకల రాజ్యంబు నీవే పంచి యిచ్చెద" వనిన విని దుర్యోధనుండు శ్రీకృష్ణదేవునిం జూచి ఇట్లనియె. కుందనంబుచందంబున నందంబైన దేహకాంతులు వెలుంగ మదపుటేనుంగు విడివడినకరణి మహామేఘుంబునుం బోలె గర్జిలుచు నెదిరించిన శత్రుసైన్యంబుల నుక్కడఁగింపుచు నారథంబు బఱచి చిత్రగతుల నడపింపఁజేయుచు నాదిత్యనందనుండైన కర్ణుండు సమర్థంబుగఁ దేజరిల్లునెడ నీవే చూడఁగలవాఁడ" వనిన నంత శ్రీకృష్ణదేవుండు "సుయోధనుంజూచి ఈబలంబునునమ్మితివేని నీయేనుంగులు గుఱ్ఱంబులు రథంబులు లేక యొంటరివై పాదచారంబున బలాయనంబు సేయంగలవాఁడవని శ్రీకృష్ణుఁడు మఱియును సుయోధనుం జూచి యిట్లనియె. అటులఁగాకయుండునేని ధర్మశాస్త్రకర్తలును యాజ్ఞవల్క్యప్రభృతులును మద్యపానంబుఁజేసిన వానియట్లు అసత్యవాదు లగుదురుగాక. ఉత్తర గోగ్రహణంబునఁ దలపాగలు గోయనిచ్చి నప్పుడు

పరాజయంబు నొంది మగుడి యుద్ధంబునకుఁ బూనిన దుర్యో ధనుం డొక్కరుండు తొల్లి త్రేతాయుగంబున నాంజనేయుం డొక్కరుండు వచ్చి లంక సొచ్చి యశోకవనంబు విరిచి రావణునిపుత్రుండయిన యక్షునిం జంపి లంకానగరంబు దహిం చి భయంబు చేకొనుట యెఱింగి మఱలఁ గయ్యంబునకుఁ బూనిన రావణుం డొక్కరుండు మీ రిరువురు పురుషులు లోకంబున మూర్ఖులనం బరగుదురు. అనుటయు ద్రోణా చార్యుం డిట్లనియె.

కృష్ణార్జును లేకీభవించిన శుక్రుండు స్వాతిగతుండై యతివృష్టి గురియుచందంబున గాల్బలంబులమీఁద నాలుగేసి బాణంబులను అశ్వంబులపయి బదునాఱేసి సాయకంబులను ఏనుంగులమీఁద నూఱేసి యమ్ములను రథంబులపయి నూఱేసి విశిఖంబులనేసి బాణవర్షంబులు గురియింపఁగలవారనిన, అం తట సంజయుండు ధృతరాష్ట్రు నుద్దేశించి కేల్మోగిచి సాష్టాంగ దండప్రణామం బాచరించి స్వస్తిశ్రీకరశ్రీకంఠవరప్రసాద సహస్రనగబలసంపన్ని కేతన అగ్నిస్తంభన జలస్తంభన ఇంద్ర జాల మహేంద్రజాల విద్యాయుక్తుండవయిన ధృతరాష్ట్రా! నీనందనుండగు దుర్యోధనచక్రవర్తి నూరుగురు తమ్ములును నూటొక్క తనయులును నిరువదివేలలక్షల బంధువర్గంబులును నూరుకోట్ల నియోగులును ఏడుకోట్లు యయోనిసంభవులును బదునాలుగుకోట్ల లలాటపట్టవర్ధనులును మూఁడుకోట్ల దండ నాయకులును,జతుష్కోటి సామంతులును,కోటియీ టెక్కోలల

వారును, దుష్టాపతులు లక్షయు, నేబదివేలు బానిసెలును, కోటితొమ్మిదిలక్షల యుద్ధవీరులును, నలువదివేల ధానుష్కులును, నాలుగులక్షల సంగ్రామవిజయులును, బదియేనులక్షల భద్రజాతి యేనుంగులును, నయిదులక్షల సంగ్రామదంతులును, ఆఱులక్షల మహామంత్రులును, ఏడులక్షల డెబ్బదితొమ్మిది వేల దళంబు గలిగి, విభవంబుతోడ నేలినది హస్తినాపురంబును, నెక్కినది కనకరథంబును, బెట్టినది మాణిక్యకిరీటంబును దనపేరు రాజరాజని వహించి, నిత్యకల్యాణంబును బచ్చలతోరణంబులు గలిగి, నవఖండ మహీమండలాధీశ్వరుండై యాఱుఖండంబుల దానేలుచు, మూఁడు ఖండంబులవారిచేతం గప్పంబులుగొనుచుఁ గనుఁ గలఁ జింతామణియుఁ జేతుల స్వర్ణవేదియుం బాదముల బద్మరేఖలుగలిగినట్టి దుర్యోధనచక్రవర్తికి వైరియై భూభారంబు హరియింపంగోరి కిరీటికిసారథ్యంబు సేయం బూనిన యచ్యుతునకు, హృషీకేశునకు, దివిక్రమునకు, జక్రధరునకు, శ్రీకృష్ణదేవునకు దండప్రణామంబుఁ గావించితి ననియె. తదనంతరంబున వేదవ్యాసమునీంద్రుండు ధృతరాష్ట్రున కిట్లనియె. బ్రాహ్మణులతోడ సద్గోష్ఠియు గంగాస్నానంబును విష్ణుపాదసందర్శనంబును భారతకథాశ్రవణంబును నయిదవవేదంబనంబరగు భారత రణప్రకారంబు ధృతరాష్ట్రునకు వినిపింప సంజయుని నియోగించి చనియె.

అంతధృతరాష్ట్రుండు సంజయుం గనుంగొని మహాత్ములైన పాండవులకు గౌరవులకు ఘోరయుద్ధంబు పాటిల్లు నేడ

నిరువాగుల నెవ్వ రెవ్వరు మొనమానిసులయి యుండిరి. ఎవ్వ రెవ్వ రతిరథ మహారథసమరథార్ధరథాతిరథశ్రేష్ఠులు; ఎవ్వ రెవ్వరిచేత నెవ్వ రెవ్వరు హతులైరి. భీష్మద్రోణు లెట్లెఱుంగునం బడిరి. దుర్యోధనుండు భీమసేనుని చేత నెట్లెఱుం గునఁబడియె నది సవిస్తరంబుగ వినుపింపు మనుటయు, సంజయుండు ధృతరాష్ట్రు నుద్దేశించి యిట్లనియె. కౌరవ బలంబులోన సుయోధనుండును కృతవర్మయు శల్యుండును భూరిశ్రవుండును బాహ్లీకుండును సోమదత్తుండును హాలా యుధుండును నతిరథులు; సైంధవుండును, నీలుండును, వృషసేనుండును, మహారథులు; బృహద్బలుండును శకునియు భగదత్తుండును లక్ష్మణకుమారుండును సమరథులు; దండ ధారుండును, కర్ణుండును, విందానువిందులును, నర్ధరథులు; కృపుండును నశ్వత్థామయు ద్రోణుండును భీష్ముండును నతి; రథశ్రేష్ఠులు; పాండవసైన్యంబున యుధిష్ఠిరుండును గుంతి భోజుండును నతిరథుండును భీముండును నభిమన్యుండును. సాత్యకియును ధృష్టద్యుమ్నుండును ఘటోత్కచుండును నతిరథశ్రేష్ఠులు; నకుల సహదేవులును పాండ్యుండును సమ రథులు; ద్రౌపదీపుత్రపంచకంబు నుత్తరుండును ద్రుపద మాత్స్యులును శిఖండియును దుష్టకేతుండును మహారథులు; విష్వచ్చుం డితరంబువాఁడని నాకు వాకొన, నీకు నూకొనఁ, గలది గాదు. పదునెనిమిది యక్షౌహిణులు నొక్కటియై యెత్తివచ్చెనేనియు నొక్క నిమిషమాత్రంబున సంహరింప

నోపు. ద్రోణుండు దినత్రయంబునను గర్ణుండు ద్విదివసముల నశ్వత్థామ యర్ధదినంబునఁ బాండవబలంబులం దెగటార్తురు. అర్జునుం డొక్కరుండు మన బలంబుల నర్ధనిమిషమునఁ బ్రతాపించి తూలించునని చెప్పి వెండియు సంజయుం డిట్లనియె.

ఆదిపర్వంబును సభాపర్వంబును అరణ్యపర్వంబును విరాటపర్వంబును ఉద్యోగపర్వంబును నివి యాదిపంచకంబు, భీష్మపర్వంబును ద్రోణపర్వంబును గర్ణపర్వంబును శల్యపర్వంబును సౌప్తికపర్వంబును నివి యయిదు యుద్ధపంచకంబు, స్త్రీపర్వంబును శాంతిపర్వంబును ఆనుశాసనికపర్వంబును నివి మూఁడు శాంతిత్రయంబు, అశ్వమేధపర్వంబును ఆశ్రమవాసపర్వంబును మౌసలపర్వంబును మహాప్రస్థానికపర్వంబును స్వర్గారోహణపర్వంబును నివి యశ్వమేధపంచకంబు ఈ పదునెనిమిది పర్వంబులు కృష్ణద్వైపాయనుండు రచియించె. మార్గశీర్షమాసమున శుక్లపక్ష త్రయోదశి దినమున భరణీ నక్షత్రంబున భారతయుద్ధంబు ప్రవృత్తంబయ్యె. అందుఁ గృష్ణపక్ష సప్తమీ దివసంబున శిఖండిని ముందు నిడుకొని యర్జునుండు భీష్ముం బడవేసె. అష్టమీదివసంబున భగదత్తుండును నవమినాఁడు జయద్రథుండును దశమినాఁ డభిమన్యుండును నేకాదశిదినంబున సైంధవుండును అర్ధరాత్రంబున ఘటోత్కచుండును ద్వాదశి వేఁకువజామున విరాటద్రుపదులును ఆ మధ్యాహ్నంబున ద్రోణాచార్యుండును త్రయోదశి దినంబున

ననేక రాజసంఘంబులును చతుర్దశి మధ్యాహ్నంబున మశ్వా సనుండును నా సాయంసమయంబున మహారథుం డయిన గ్ర్యుడును రణంబునం బడిరి. పిదప దుర్యోధను సైన్యంబు దైన్యంబునొంద భేరీమృదంగాది వాద్యఘోషంబు లేక వీరాలాపంబులు మాని హర్షంబులు తొలంగి సూర్యుండు లేనిదినంబునుం బోలె జంద్రుండు లేని రాత్రిపగిది కాంతిహీనంబయి కనుపించె. కమలదళంబులవంటి కన్నులుగలిగిన దుర్యోధను ముఖంబు కళావర్జితంబయి కానంబడియె. ఇట్లు కౌరవసైన్యంబు కర్ణరహితంబయి శోభింపదయ్యె. తదనంతరం బమావాస్య యందు శకునియు నులూకుండును సహదేవుచేతం దెగటారిరి. ఆమధ్యాహ్నంబున శల్యుండు ధర్మరాజుచేతం జచ్చె. ఆసమయంబునం భీమసేనుని గదాఘాతంబునం దొడలు విఱిగి దుర్యోధనుండు వడియె. ధృష్టద్యుమ్నుండును శిఖండియు ద్రౌపదీపుత్రులేవురు నారాత్రియం దశ్వత్థామచేత హతులైరి. ఈవిధంబునం బదునెనిమిది యక్షౌహిణులు బదునెనిమిదిదివసంబుల సమసె.

భీష్ముం డొక్కనాండు పదివేల గుఱ్ఱంబులను తొమ్మిది వేల యేనుంగులను వేవురు మూర్ధాభిషిక్తులయిన రాజులం జంపి సమరంబు చాలించె. భీష్ముండు పదిదినంబులు ద్రోణుండు పదిదినంబులు కర్ణుండు రెండుదినంబులు శల్యుం డర్ధదినంబును బోరిరి. దుర్యోధనుం డర్ధదినం బేగదా యుద్ధంబు

సేసి భీమసేనుచేత సమసె. సకల క్షత్రియక్షయకారణంబుగ కురుక్షేత్రంబునని త్తెఱంగున భారతయుద్ధంబు ప్రశస్తంబయ్యె. తొమ్మిదివేల యేనుంగులును నేనుంగునకు నూరేసిరథంబులును రథంబునకు వెయ్యేసి గుఱ్ఱంబులును గుఱ్ఱంబునకు నూర్వురు కాల్బలులును నిది ధర్మనందనునకు మూలబలంబు. కురుక్షేత్రంబు యజ్ఞవేదియు జనార్దనుండు యూపంబును దుర్యోధనుండు పశువు కర్ణుండు హవిస్సు పాంచాలి యరణియు భీమసేనుం డగ్నియు నర్జునుండు హోతయు భీష్మద్రోణులు నాజ్యంబులు కారణంబను యాగంబున ధర్మరాజు యజమానుండై గాండీవ:బును బాణంబులను యొడు స్రుక్స్రువంబులచేత సమస్తరాజసంఘబు లనియొడు హవ్యద్రవ్యంబుల హోమంబును జేయించె. ఇది భారతసారసంగ్రహంబు భారతసావిత్రి యనంబరగు. ఎవ్వరేనియుఁ బ్రాతఃకాలమున మధ్యాహ్నంబున సాయంసమయంబున సంకటకాలంబున భయముదోఁచిన యెడ నీభారతసావిత్రిని బఠించినవారికి సకల కార్యంబులు సిద్ధించి సంవత్సరోపార్జితంబులయిన దురితంబులు తొలంగు. స్వర్ణమాలికాలంకృతంసులగు వేయిధేనువులు సత్పాత్రంబున దానముచేసిన ఫలము గలుగు నని వేదవ్యాసవచనము గలదు. ఇది చదివినవారికి వినినవారికి సకలైశ్వర్యభోగంబులు గలిగి పుత్రపౌత్రాభివృద్ధి రాజ్యవృద్ధి గలిగి తదనంతరంబున విష్ణుసాయుజ్యంబు గలుగును.

---

# శ్రీ నా థ మ హా క వి.



ఆంధ్రకవులలో శ్రీనాథమహాకవి యగ్రగణ్యుఁడు. ఈయన భారద్వాజసగోత్రుఁడు. తాత పద్మనాభామాత్యుఁడు. ప్రౌఢకవిగాన మనుమని సర్వంకషసాహిత్యధురీణుని బ్రతిభాశాలిని గావించినాఁడు. శ్రీనాథుఁడు కవియే కాదు. అఖండ పండితుఁడు. సారస్వతము నంతయుఁ గాలించిన విమర్శకచక్రవర్తి. సాహిత్యవార్ధి మథించిన మంథాననగము. దిగ్దంతుల వంటి పండితుల నీతఁడు జయించినాఁడు. ఆస్థానముల కేగి రాజులచే వివిధసత్కృతులనందుటయే గాక కనకాభిషేకములను సైతముఁ బడసినాఁడు. తెనుంగురాయ లడుగుటయే తడవుగ ఘుమఘుమ వలచు మృగమదమును వలసినంత సమర్పించినాఁడు. విస్సనమంత్రి సగౌరవంబుగ నాహ్వానించిపసిఁడిపళ్లెరమునఁ బాయసాపూపాది బహువిధభక్ష్యభోజ్యముల నర్పించువాఁడు. ప్రౌఢదేవరాయలు తనముత్యాలశాలకు రావించి జగత్ప్రసిద్ధముగాఁ గనకాభిషేకముఁ గావించినాఁడు. శ్రీనాథుఁడు పరాజయ మెఱుంగఁడు. పోయినతావున నగ్రతాంబూలము తనది. పరులకడఁ జేయి జాపుటలోఁగూడ నితఁడు దైన్య మెఱుంగఁడు. ఒకరియనుగ్రహమునకు లొంగి ముఖస్తుతులఁ గావించినవాఁడు కాఁడు. కవిసార్వభౌమ బిరుద మాంధ్రకవులలో నీతఁ డొక్కఁడే ధరించినాఁడు. అంతకు

ముందున్న కవులలోఁ గాని పిమ్మటకవులలోఁ గాని శ్రీనాథు న కీడుజోడుగాఁదగిన ప్రతిభాశాలి జనింపలేదనుట సత్యదూర ముకాదు. శ్రీనాథు వైదుష్యాతిశయము నాతని బావమఱఁ దియగు దగ్గుపల్లి దుగ్గన యిట్లు ప్రశంసించినాఁడు.

సీ. సంస్కృతప్రాకృత సౌరసేనీ ముఖ్య
భాషాపరిజ్ఞాన పాటవంబు
పన్నగపతి సార్వభౌమ భాషిత మహా
భాష్యవిద్యాసమభ్యాసబలము
అక్షపాదకణాద పక్షోదీరిత
న్యాయకళాకౌశలాతిశయము
శ్రుతిపురాణాగమస్మృతిసాంఖ్యసిద్ధాంత
కబళన వ్యుత్పత్తిగౌరవంబు
తే. గీ. పూర్వకవి ముఖ్యవిరచితాపూర్వకావ్య
భావ రససుధాచర్వణ ప్రౌఢతయును
గందళింపంగఁ గాశికాఖండనైష
ధ ప్రముఖ వివిధ ప్రబంధము లొనర్చె.

శ్రీనాథుని కవితాధార ప్రౌఢ గంభీర మైనది. సంస్కృతపదజటిలము. శ్రుతికటువుగఁ దోఁచినను భావము సులభముగా నవగతమగును. ఆంధ్రీకరణమున నీతఁడె తరువాతి కవులకు మార్గదర్శకుఁడు. శృంగారనైషధములో భట్టహర్షుని కవితాకౌశలమంతయు స్వతంత్ర రచనమువలెఁ

ప్రదర్శించినాఁడు కాశీఖండ భీమఖండములలోని, పురాణ కథాంశములఁ బ్రబంధపాకమున నిముడ్చి నిస్సారములగు కథాంశములకు జీవము పోసినాఁడు. హరవిలాసమున శివుని విలాసపురుషుని గావించి శృంగారలీలల సమకూర్చినాఁడు. ఆహా! శ్రీనాథుని మేధాసంపత్తి. బాపురే శ్రీనాథుని కవితా కౌశలము. నిరర్గళము సమాసభూయిష్టమునగు కవితాధార; పరులకు లోఁబడనొల్లని స్వతంత్రస్వభావము; సారస్వతసముద్రమును మథించిన నిరంకుశ పాండిత్యము ఈకవితల్లజుని ప్రశస్తికిఁ గారణములు. ఒకరు మెచ్చెదరని కవితాస్వాతంత్ర్యమును జంపుకొనుటయుఁ బరులు శ్లాఘింపవలెనని లేని పైపూతలుపచరించుకొనుటయు నీకవిరాజెన్నం డెఱుంగఁడు. కవితా రచనమునఁ దానుఁ బాటించిన నియమమును శ్రీనాథుఁడు కాశీ ఖండమున నీక్రిందివిధముగాఁ జెప్పుకొనినాఁడు.

"తే. గీ. ప్రౌఢిపరికింప సంస్కృతభాషయందు
పలుకు నుడికారమున కాంధ్రభాషయందు
ఎవ్వ రేమనుకొన్న నా కేమి లెక్క
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష."

శ్రీనాథుని కాలమున ఆంధ్రవాఙ్మయము సర్వతోముఖముగ వికాసమునకు వచ్చినది. వెలమ, రెడ్డి రాజులు ఆంధ్రసామ్రాజ్య స్థాపనకుఁ గడఁగుచుండిరి. యవనులు దేశమును గబళింప ముందంజ వేయుచుండిరి. కవులు సారస్వ

తోపాసనకుఁ గడంగుచుండిరి. బమ్మెర పోతరాజు, గౌరన, అనంతామాత్యుఁడు, సర్వజ్ఞ సింగభూపాలుఁడు, దగ్గుపల్లి దుగ్గన్న, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు, మడికి సింగన, జక్కన, నిశ్శంక కొమ్మన్న మున్నగు మహాకవులు వాఙ్మయమున కెంతయో సేవ గావించిరి. శ్రీనాథుఁ డాకాలపుఁ గవి సామంతులకుఁ బరిపాలకుఁడు, శాసకుఁడు గావుననే కవిసార్వభౌమ బిరుదము గడించి సారస్వత ప్రపంచమును బ్రశాంతముగాఁ బరిపాలించి ధన్యుఁడయ్యెను. శ్రీనాథుని రసతృష్ణ నిరుపమానమైనది. రసికుఁడగు ప్రభుని సందర్శించుటకు అరసికుఁడగు పండితమ్మన్యుని బరాభవించుటకు నితఁడు ముందడుగు వేయును. పరోత్కర్ష నీతఁడు సహింపఁడు. దైన్యజీవనము కలలోనైన నెఱుంగఁడు. ప్రౌఢరాయని వద్ద డిండిమభట్టుఅను ప్రచండ పండితుఁడు వసించి సామాన్యపండితులకుఁ బ్రభుదర్శనమునకె యవకాశము కల్పింపకుండెను. నిరంకుశుఁడగు శ్రీనాథున కీయవరోధ మసహ్యమయ్యెను. తన ప్రాగల్భ్యము వెల్లడియగుటకై శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయుల కిట్లు వర్తమాన మంపినాఁడు.

సీ. డంబుచూపి ధరాతలంబుపైఁ దిరుగాడు
కవిఘూఁదఁగాని నాకవచమేయు
దుష్ప్రయోగంబుల ధారకొనిచెప్పెడు
కవిశిరస్సునఁ గాని కాలుచాప

సంగీతసాహిత్య సరసవిద్యల నేర్చు
కవులభామ్మలుగాని కాల్చి విడువ
చదివి చెప్పఁగ నేర్చి సభలందు విలసిల్లు
కవిసోరుగాని వరికట్టులుగదన్న

తే. గీ. దంటకవులకు బలువైన యింటిమగఁడ
కవులవాదంబు విన వేడ్కగలిగెనేని
నన్నుఁ బిలిపింపు మాస్థానసన్నిధికిని
లక్షణోపేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర.

ప్రౌఢరాయలు శ్రీనాథుని ప్రశస్తి యంతకమున్నె వినియుంటచేఁ దన యాస్థానమునకు రావించెను. చిరకాలము డిండిమభట్టుతో విద్యావివాదము జరిపి తుదకు శ్రీనాథుఁడు విజయము బడసెను. అపుడు శ్రీనాథునికిఁ గనకాభిషేకము గావించి ప్రౌఢరాయలు తన యసమానవిద్యాభిమానమును బ్రకటించినాఁడు. ఈకథాంశము సర్వజ్ఞుని సందర్శనమునకుఁ బోవుతఱి రచించిన సీసపద్యమునో నీ క్రింది విధముగాఁ శ్రీనాథుఁడు చేర్కొనినాఁడు.

సీ. దీనారటంకాల తీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునను
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క

చంద్రశేఖరు క్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద
తే. గీ. మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావు సింగ మహీపాలు దీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు
సరససద్గుణ నికురుంబ శారదాంబ.

ఈపద్యమెగాక కాశీఖండములోనిదగు
"కర్ణాటక్షితిపాలమౌక్తికసభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నానజగత్ప్రసిద్ధకవిరాట్సంస్తుత్యచారిత్ర"

అనుపద్యభాగము గూడ నీకనకాభిషేక కథ నను వదించుచున్నది. ఆకాలమున రాజసన్మాన మందుటయే కష్టము. సమకాలికులు పరశ్రేయోఽసహనులు. ఈపరిస్థితులలోఁ బేరోలగంబునఁ బ్రతిపక్షులముందు స్వర్ణస్నానము చేయించుకొని రాజసత్కృతి నొందుభాగ్య మొక్క-శ్రీనాథునికిఁ దక్కఁ దదితరులకు సాధ్యమా!

శ్రీనాథుఁడు పలనాటివీరుల కథలు క్రీడాభిరామము రచించెనందురు. ఎన్నియో చాటువు లతని కర్తృత్వముగఁ బండితులు చెప్పుకొనుచున్నారు. ఈతఁడు వేమభూపాలుని వద్ద విద్యాధికారి. వీరభద్రారెడ్డికిఁ బరమాప్తుఁడు. అవచి తిప్పయ్యసెట్టికి బాలసఖుఁడు. ఈయన రచించినగ్రంథము లసంఖ్యాకములు. ఎవ రెఱుఁగని యపూర్వగ్రంథములు

పెక్కులీతఁడు వ్రాసినవి బయలుపడుచున్నవి. త్రిలింగదేశమున నీయన జూడనిప్రదేశము, సన్మానము పొందని తావు లేద నుట యతిశయోక్తి కాదు. తాను రచించిన గ్రంథక్రమము నీతఁ డీ క్రిందివిధముగఁ గాశీఖండములోఁ జెప్పుకొనినాఁడు.

సీ. చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు
రచియించితిమరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాలనూత్నయౌవనమున
శాలివాహనసప్తశతి నుడివితి
సంతరించితి నిండు జవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాష
ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకునిమహిమ
తే. గీ. బ్రాయ మింతకు మిగులఁగై వ్రాలకుండఁ
గాశికాఖండ మను మహాగ్రంథ మేను
తెనుఁగుఁ జేసెదఁ గర్ణాటదేశ కటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

ఈపద్యమునఁ బేర్కొనఁబడిన మరుత్తరాట్చరిత్రము, శాలివాహన సప్తశతి యను గ్రంథములు లభించుట లేదు. ఇందుఁ బేర్కొనఁబడని శివరాత్రిమాహాత్మ్యము హరవిలాసము లభించినవి. క్రీడాభిరామము, పలనాటి వీరచరిత్రము ఈకవి రచించినవా కావా యను వివాద మొండుగలదు.

శ్రీనాథుఁడు రచించిన సంస్కృతాంధ్రశాసనములు పెక్కులుపలబ్ధములైనవి. కాటయవేముఁడు పెదకోమటి వేమారెడ్డి కుమారగిరి, మామిడి సింగనమంత్రి మున్నగు వారిపేరులతో నుండు వ్యాఖ్యానగ్రంథములలో శ్రీనాథుఁడు కొంతయో అంతయో పాల్గొనియుండును. జీవితకాలమంతయు సమస్తైశ్వర్యము లనుభవించి పల్లకిలోనియడుగు క్రిందనుంపక సమస్త భోగముల నొందిన యీమహాకవి కనులముందె ఆంధ్రదేశము పరాధీనమైనది. సారస్వతప్రియులగు రాజచూడామణులు పరలోక మలంకరించిరి. కవికి ముదిమి ప్రాపించెను. పోషించు ప్రభువులు కాలగతులైరి. తుదికాలమునఁ బూలమ్మిన తావునఁ గట్టెలమ్మినట్లు ఆంధ్రవాఙ్మయోద్ధారకుఁడు కవిసార్వభౌముఁడు పండితచక్రవర్తియగు శ్రీనాథభట్టారకుఁడు దరిద్రమునకులోనయ్యెను. ఆంధ్రదేశములోని ముఖ్యభాగము లుత్కలులు లాక్రమించికొనిరి. శ్రీనాథుఁడు వారి ప్రాపకమునకుఁ బాటువడక కుటుంబపోషణమునకు మార్గములేమిచే నానావస్థలు పడి ఉత్కలరాజులకడ గ్రామములు గుత్తకొని నిర్ణయధనము వారికొసగి మిగిలిన దానితో జీవయాత్ర ముగించుకొనుచుండెను. దురదృష్టవశమున అతివృష్టి దోషము అనావృష్టిదోషము ప్రాప్తించి శ్రీనాథుడుఁ గుత్త తీసికొన్న బొడ్డుపల్లి గొడ్డుబోయెను. సస్యములు నశించెను. గజపతులకు ఏడునూరుల టంకములు చెల్లింపవలెను. చేతఁ

గాసు లేదు. కనికరించు ప్రభువులు లేరు. దయాశూన్యులై గజపతిరాజులు శ్రీనాథుని నానావిధముల హింసించిరి. ఒడ్డె రాజు లొనరించిన విడ్డూరములఁ బనవి పనవి శ్రీనాథమహాకవి యిట్లు పరితపించినాఁడు.

సీ. కవిరాజకంఠంబు కౌఁగిలించెనుగదా
పురవీథి నెదురెండ పొగడదండ
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబునఁ
దగిలియున్నది గదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ
సార్వభౌముని భుజాస్తంభమెక్కెనుగదా
నగరివాఁకిటనుండు నల్లగుండు
తే. గీ. కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లిని గొడ్డేటి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేదునూర్లు.

విద్యాభిమానశూన్యులగు రాజులు శ్రీనాథు నెండలో నిలువఁబెట్టిరి. కాళ్ళకు సంకెళ్ళు వేసిరి. చేతుల కరదండములఁ దగిలించిరి. భుజములపయి బండలెత్తిరి. ఈదురవస్థలకులోనై సారస్వతజీవనుఁడగు కవిసార్వభౌముఁడు పరితపించుచుండ నేవిద్యాభిమానియేని చంచలమగు నైశ్వర్యము నడ్డుపెట్టి బాధావిముక్తుని గావింపరైరి. కడకు శ్రీనాథుఁ డిహలోక

యాత్రి ముగించుతఱి గూడ దైన్యముప్రకటించుకొనక స్వర్గ వాసులగు శుక్రుని బృహస్పతిని దల్లడపఱచుచుఁ దాను జీవితము సమాప్తి చేసికొనుచుంటినని చెప్పికొనెను.

సీ. కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయ డిచ్చు
రంభగూడఁ దెనుఁగు రాయరాహుత్తుండు
కస్తురి కేరాజు బ్రస్తుతించు
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁగలదు
కైలాసగిరిబండ మైలారు విభుఁ డేగి
దినవెచ్చ మే రాజు దీర్పఁగలఁడు

తే. గీ. భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి.

ఆంధ్రవాఙ్మయాకాశమునఁ బ్రచండదీధితితో వెలిఁగిన కవిమార్తాండుఁ డస్తంగతుఁడైనాఁడు. కాని యాతని యశఃకాంతిమాత్రము నేఁటికి నప్రతిహతముగఁ బ్రజ్వరిల్లుచున్నది. మహాకవియగు శ్రీనాథుని కావ్యరత్నములు సారస్వతోపాసకులకుఁ బురశ్చరణ మంత్రములవలె ననుసంధేయములుగ నున్నవి.

---

# కఠిన పదములకు అర్థములు.

## ద్రౌపదీ వస్త్రాపహరణము.

టీ. అగ్రమహిషి = పెద్దభార్య, ఓటువడి = ఓడిపోయి, దుష్కృతవుడు = చెడుబాదరి, అదత్తప్రతివచనుఁడు = ఒసంగబడని జవాబువాగలఁడు, సందిగ్ధము = సందేహమైనది, పిఱుంద = వెనుక, అధోనీవి = జాఱుచున్న చీరెముడి, అవిరళము = తెంపులేనిది, ఉపలక్షించి = చూచి, తడయక = ఆలసింపక, దురోదరము = జూదము, అపశదుఁడు = నీచుఁడు, శిరోజములు = వెండ్రుకలు, వాతాధూతము = గాలిచే ఎగురగొట్టబడినది. పతాక = జెండా, భూయిష్ఠము = విస్తారము, ఉద్గతము = బయలువెడలునది, రూక్షకటాక్షవీక్షణము = కోపముతో గూడిన క్రిగంటి చూపులు, పరిభూతము = పరాభవము, దాహము = కాల్చుట, విముఖుఁడు = పెడమొగమైనవాఁడు, అపకృష్ట = లాగబడినది, కితవాహూతుఁడు = జూదమునకుఁ బిలువఁబడినవాఁడు, పణము = పందెము, తఱుసంటి = ఉద్ధతము, బంధకి = జారిణి, ప్రత్యాఖ్యానము = నిరాకరించుట, వ్యవసాయము = యత్నము, సద్గర్హితుఁడు = ఉత్తములచేఁ దిరస్కృతుఁడు, జఘనము = పిరుదులు, వక్షశ్శైలరక్తౌఘనిర్ఝరము = వక్షస్స్థలమను కొండయందలి నెత్తురను సెలయేరు, దేవమంత్రి = బృహస్పతి, మఘవకులిశము = ఇంద్రునివజ్రము, పరిభూత = పరాభవింపఁబడినది, కలాపవిభాసి = సొమ్ములచేఁ బ్రకాశించునది. భగ్నోరుతరోరుఁడు = విఱుగఁగొట్టఁబడిన గొప్పతొడలు గలవాఁడు, దుష్పదవీరతులు = చెడుత్రోవలందు ఆసక్తులు, కలశభూ = ద్రోణుఁడు, తెప్పరము = తిరస్కారవాక్యము, అభ్యర్చిత = పూజింపఁదగినది, లగ్గు = మేలు, సక్షమచిత్తుఁడు = ఓర్పుగల చిత్తముగలవాఁడు, దుర్ణయము = అవినీతి, ఒండ్లు = ఇతరులు, విపత్తిసాగరము = ఆపద యను సముద్రము, నిజేశులు = తనభర్తలు, నెమ్మి = ప్రేమ, దాస్యము = దాసిపని,

## భరతుని సౌశీల్యము.

టీ. సంభ్రమము = తొట్రుపాటు, ఉపాయనము = కట్నము, పుత్తెంచుట = పంపుట, అజినములు = చర్మములు, గర్హ = నింద, ఆవిష్టుఁడు = ఆవేశముగలవాఁడు, అంకించుచు = కదలించుచు, మాతృహంతలు = తల్లిని జంపినవారు, అగ్రసవిత్రి = పెద్దతల్లి, కఠినశపథము = అసాధ్యప్రతిజ్ఞ, సమ్మార్జనము = స్పృశించుట, వనవి వనవి = ఏడ్చి ఏడ్చి, ప్రాకృతుఁడు = అవివేకి, తపోవేషి = ముని, బాణాసనము = విల్లు, సస్మితాస్యుఁడు = చిఱునవ్వుగల మొగముగలవాఁడు, జగత్త్రాణుఁడు = లోకములేలువాఁడు, పెంధూళి = గొప్ప దుమ్ము. ఘనచుంబి = మేఘమంటునది, గహ్వరము = గుహ, తదంఘ్రిపురోభాగమున = అతని పాదముల ముందువైపు, వ్రయ్యఁగ = నశింపఁగా, పిణ్యాకము = పిండి, దయితత్వము = ప్రియమైన వృత్తి, సానుజుఁడు = సోదరసహితుఁడు; మస్తకము = తల, దివాకరాన్వయపతి = సూర్యవంశపోషకుఁడు, అరుదు = ఆశ్చర్యము

## వ్యాసమహర్షి కాశి విడచుట.

టీ. వైవర్ణ్యము = మారురంగు, ఎఱాటము = విషయము, హట్టము = అంగడివీధి, కంఠేకాలుఁడు = శివుఁడు, సాక్షాత్కారము = ప్రత్యక్షము, సైకతవేదికలు = ఇసుకతిన్నె అరుగులు, తీరోత్సంగము = ఒడ్డుచేరువ, అంగుష్ఠము = కాలి బొటనవ్రేలు పారాశర్యుఁడు = వ్యాసుఁడు, వాతాపిదమనుఁడు = అగస్త్యుఁడు, శమదమములు = శాంతి యింద్రియనిగ్రహము, మన్మథదమనుపీఁడు = కాశి, సౌహార్దము = స్నేహము, క్షుధాక్షోభ = ఆకలిబాధ విప్రవాటిక = బ్రాహ్మణవీధి, అభ్యుదితము = ఉదయించినది అఘమర్షణస్నానము = అఘమర్షణ మంత్రములతోఁ జేయుస్నానము. దూపటిల్లి = దప్పిగొని, ఉష్ణీషకౌశేయము = తలగుడ్డయను పట్టుపంచె, ఉడిలగొని = భయపడి, పంచాశత్తు = ఏబది, రవళి = మ్రోత, పాఠీనచ్ఛాయాదాయాదములు = ఒక విధమగు చేపవన్నెవంటిది, పాణింధమము = కొలిమితిత్తి, శుద్ధాంతము = భార్య,

జోహారు = వందనము, ఎడ్డె = ఆటంకము, గాడు = అపవిత్రిత, బుభుక్షిత, కిం నకరోతిపాపం = ఆఁకలిగొన్నవాఁడేపాపము చేయఁడు, జాహ్నవి = గంగ, ఏఁకట=తృప్తి, విబుధల్లోకకల్లోలిని = గంగ, ఆసారప్రస్తారము = నీటి బిందువులుచల్లుట, గిలుకలు = ఛత్రివిశేషము, శంభళీజనము = దాసిజనము, వితానము = చాందిని, వృద్ధానుపూర్వకము = ముందు పెద్దవారలుండునట్లు, మందగతి = మెల్లఁగా, ముగ్ధేందుకళాకిరీటుఁడు = బాలచంద్రధరుఁడు, శివుఁడు. ఉర్వీగీర్వాణులు = బ్రాహ్మణులు, రాజహంసయాన = హంసగమన (స్త్రీ), అసితోత్పలము=నల్లగలువ, ఓగిరము=ఆహారము, ఉపస్తరించి = రాచి, మిథ్యాదృష్టి = రిత్తచూపు, షడ్రసీసామగ్రీరుచిమత్పదార్థములు = ఆఱురసములవస్తువులుగల రుచిగల వస్తువులు, సాజె = వేపుఁబియ్యపుటన్నము, గరనాయి = సంకోచము, అభ్యుదయము = సమృద్ధి, వేలుపుగిడ్డి = కామధేనువు, నూపురము = అందె, పుండ్రేక్షు = చెఱకు, షాడబము = మధురాదిరసము, ఘంటాపథము = రాచబాట, అభ్యంతర భవనము = లోనియిల్లు, చట్టలు = భుజములు, క్రోధము = కోపము, పూరించెఁ = నించెను, శుద్ధాంతకాంత = భార్య, ప్రత్యుత్థానము = లేచుట, పండితమ్మన్య = పండితుఁడ ననుకొను వాఁడు, రాకించుట = మోదుట, ఉడుపతిమకుటుఁడు = శివుఁడు, తుఱఁగలి = ప్రకాశము, సంగోలి = సందేహము, అభ్యుదయము = మేలు, దూయమానము = బాధింపఁగూడని, కేకిలి = న్యాయములు, అవ్యాహతగతి = నిరాటంకము, అపరాధభరము = దోషాతిశయము ముత్తఁగ = కొట్టుఁగా, ఈసనము = ఈర్ష్య, గంటి = వినాయకుఁడు, అపాంగము = క్రేఁగంటిచూపు, భవాని = పార్వతి, న్యక్కారము = తిరస్కృతి.

## ఐరావత చరిత్రము.

శైశవము = బాల్యము, సురపుంగవుదంతి = ఐరావతము, జటాభారము = జడలబరువు దంతావళము = ఏనుగు, కలధౌతము = వెండి, మృత్తిక = మట్టి, మృగమదఘనసారమిళితము = కస్తూరి పచ్చకర్పూరము కలసినది. పుణ్యకాంత = ముత్తైదువు, కపిత్థము = వెలగపండు, కుబలాత్మజ =

కాలమువాఁడె యనుట విశ్వసనీయము. నన్నయభట్టుకవిత మృదుమధురభూయిష్ఠమై సంస్కృతపదజటిలముగ నుండును. ఈయన ఆంధ్రశబ్దచింతామణి అను వ్యాకరణముగూడ వ్రాసెనని చెప్పుదురు.

నన్నయభట్టు ముద్గలగోత్రుఁడు. వైదిక బ్రాహ్మణుఁడు. వాగనుశాసన బిరుదము గలవాఁడు. సహపాఠియగు నారాయణభట్టు సహాయమున నితఁడు భారతము రచించెను. నారాయణభట్టు గొప్ప విద్వాంసుఁడు. పాండవుల ద్యూతమునందు ధర్మజుఁ డోడి కడకు ద్రౌపదినిఁగూడ నోడెను. దుర్యోధనుఁడు విజయానందమున మునుంచి పాండవుల ననేకభంగుల నొప్పించెను. అంతతోఁ బోక ద్రౌపదినిఁ బట్టి సభకుఁ దెమ్మని ప్రాతికామి యనువానిని బంపెను. ఇదియె కథారంభము.

—♦ ప్రాతికామి ద్రౌపదియొద్దకు వచ్చుట ♦—

ఆ. వె. అవని నాథుచేత ♦ నాజ్ఞాపితుండయి
సూతనందనుఁడు ♦ ప్రాతికామి
పాండవాగ్రమహిషి ♦ పాలికిఁ జని భక్తి
వినతుఁ డగుచు నిట్లు ♦ లనియె సతికి.

తరువోజ. ధనసంపదలు నిజ♦ధరణి రాజ్యంబుఁ
దనయులం దమ్ములఁ ♦ దన్నును నిన్నుఁ
దనర జూదంబాడి ♦ ధార్తరాష్ట్రులకు
ధర్మతనూజుండు ♦ తా నోటువడియె
వనజాక్షి ! కౌరవ♦వరువని నిన్ను

పిడుగుబడుటకు సమము, సౌజన్యపాత్ర = స్నేహయోగ్యులు, ఆకీర్ణము = వ్యాప్తము, జీవన్మృతులు = బ్రదికియుండి చచ్చినవారు. కుప్పసము = కుబుసము, స్యందనము = రథము, కోదవలు = కొఱంతలు, ఎలయించి = మోసగించి, వీచీకలాప = తరంగసమూహముగలది, వకుళతిలకసహకారనమేరుప్రియకమేదురము = పొగడ, బొట్టుగు, తియ్యమామిడి, సురపొన్న, వేగింకణము చెట్లచే దట్టమైనది, ధౌతపరిధానములు = ఉదికినవస్త్రములు, వృకములు = తోడేళ్లు, వాలుమెకములు = పెద్దపులులు, విశ్వాసము = నమ్మకము, కొండవిల్కాని కోదండము = శివుని విల్లు, పాథోనిధి = సముద్రము, కూకటి = పిలకజుట్టు, విరహవేదన = ఎడబాటుచింత, అప్పళించుట = వాల్చుట, హుటాహుటి = త్వర, కరశీకరములు = తొండపు నీటిబొట్లు, రామానుజుఁడు = లక్ష్మణుఁడు, ధమ్మిల్లము = కొప్పు, కృష్ణాజినము = లేడితోలు, చౌలము = చూడాకర్మ, షడంగము = ఆరు అంగములు, నిండోలగము = పెద్దకొలువు, గాధేయుఁడు = విశ్వామిత్రుఁడు, కింకిణి = చిఱుగంటలు, పరిధానము = పైగప్పు వస్త్రము, అక్షౌహిణి = 21870 రథములు, 21870 ఏనుగులు, 65610 గుఱ్ఱములు, 109 50 కాలుబంటులు గల సేన, దూర్వాదళము = గరికిపోచలు, హేమపట్టిక = బంగారుపట్టె, కదళీతరువు = అరటిచెట్టు, విపక్షుఁడు = విరోధి, రక్తసిక్తాంగుఁడు = నెత్తురుచేఁ దడిసిన మేను గలవాఁడు. పటహము = తప్పెట. మఖతురంగము = యజ్ఞాశ్వము, సజ్జీకృతకార్ముకుఁడు = ఎక్కుబెట్టఁబడిన విల్లుగలవాఁడు, కంకగృధ్రములు = రాబందులు గ్రద్దలు, చాపవిద్య = విలువిద్య, సారింపుచు = త్రిప్పుచు, క్రోధకషాయితాక్షుఁడు = కోపముచే నెఱ్ఱనైన కనులు గలవాఁడు, యాగీయాశ్వము = యజ్ఞాశ్వము, కురంగశృంగపాణి = లేడికొమ్ము హస్తమునఁ గలవాఁడు, విశంకటులు = విరివియైన వారు, నిరవధికములు = విస్తారములు, ధూళిధూసరితగాత్రుఁడు = దుమ్ముచే మాసిన దేహముగలవాఁడు, సప్తసప్తి = ఏడుగుఱ్ఱములుగలవాఁడు (సూర్యుఁడు), అగ్రజుఁడు = అన్న, కేడెము = డాలు (డాలువారు). జర్జరీభూతము = శిథిలము, పగాకు = అశ్రద్ధ, వెగ్గ

లంబు = మిక్కుటము, హాయకబంధములు = గుఱ్ఱపు తలలు, పక్కెర = గుఱ్ఱపు అంగీ, జాలెదేక = డేగలలోభేదము, భీషణము = భయంకరము లంఘించి = దుమికి, విసంజ్ఞ = కదలిక లేనివాఁడు, పంచత్వము = మరణము చమూసమూహము = సేనాబృందము, లకోరికోల = బాణపుముల్లు, రుధిరాభిషిక్తుఁడు = రక్తముచే స్నానము చేసినవాఁడు, చలపట్టి = ఉచ్చరించి. వేగరలు = వేగుతెచ్చువారు, లావు - వెరవు = బలము, ఉపాయము, వెల్లువలు = ప్రవాహములు, పరశుఖండితము = గండ్రగొడ్డలిచే నరుకబడినది. హిమాంబుపూరము = మంచునీటి ప్రవాహము, పొదలి = ఇమిడ్చి వ్యాకులమానసుఁడు = కలతనొందిన మతిగలవాఁడు కోదండమౌర్వి = వింటినారి, కటాహము = కడవ (బాన) ఛురిక = చురియకత్తి, రోదసి = భూమ్యాకాశమధ్యము, కులాచలము = కులపర్వతము, కంకపత్రములు = బాణములు, పొడుపుగుబ్బలి = ఉదయాద్రి, నారసము = బాణము, కట్టలుక = మిక్కిలికోపము, అంగజప్రతిమానులు = మన్మథసమానులు, నిర్వ్యాజము = నెపములేనిది, ఇననందనుఁడు = సుగ్రీవుఁడు, కీలాకరాళము = జ్వాలవలె వ్యాపించిన, నిశాతనిశఖములు = వాఁడిబాణములు, కటకము = కడియము, సముజ్జ్వలకేతనము = ప్రకాశించు జెండా, అజ్ఞాతవాసము = తెలియని ఉనికి, మూర్తిమంతము = ఆకారము గలది, నుస్తిష్కము = ఎముకలలోని చమురు, యాతుధానులు = రాక్షసులు, గరగ = చిన్నపాత్రము, వల్మీకసంభవుఁడు = పుట్టలోఁ బుట్టినవాఁడు (వాల్మీకి), కవదోనలు = జంట అమ్ములపొదులు, కృతకృత్యులు = చేయఁబడిన పనులు గలవారలు, నివృత్తి = నివారణము, తపఃకృశశరీర = తపముచేఁ జిక్కిన దేహముగలది, వత్సము = ఆవుదూడ, కాకుత్స్థుఁడు = రాముఁడు, కందళితము = మొలక యెత్తినది, మానవతి = అభిమానముగలది.

## స భా ప ర్వ ము.

టీ. వైవస్వతుఁడు = యముఁడు, అర్థిజనంబు = యాచకులు, వాణిజ్యము = బేరము, వణిజుఁడు = కోమటి, సమాత్రుల్లజుఁడు = చక్రవర్తులలో